Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 50 • 10-12-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# రాజుకుంటున్న అసమ్మతి కుంపట్లు!

- సిఎం పదవి సంపాదించుకోవడం కంటే దాన్ని నిలబెట్టుకోవడం చాలా కష్టంగా మారింది కిరణ్‌కుమార్‌రెడ్డికి.



మంత్రుల అసమ్మతి తుఫాను తీరం దాటింది. కానీ అల్పపీడనం రూపంలో ప్రభుత్వం మెడల మీద ఆవరించే వుంది. శాఖల కేటాయింపులో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి తీరు బాగాలేదని ఆగ్రహంతో, అక్కసుతో ఎగిరెగిరి పడిన మంత్రులంతా సర్దుకొన్నారు. ఏ ఒక్కరి శాఖలో మార్పు లేకుండానే, ఆగ్రహాలు ఆవేశాలు చల్లారిపోయాయి. రాజీనామా కాగితం చేతితో పట్టుకొని ఢిల్లీ వరకు వెళ్లిన వట్టి వసంతకుమార్ మెడలు కూడా వంచారు. అయితే ఈ మంత్రుల చేత రాజీనామాలను వదలి రాజీబాట పట్టించడంలో ముఖ్యమంత్రి పాత్ర పరిమితం కావడం గమనార్హం. అధిష్టానం తరఫున అహ్మద్ పటేల్, వీరప్ప మొయిలీ, గులాం నబీ అజాద్ వంటి దూతలు చేసిన దౌత్యం వల్లనే మంత్రులు పిల్లి కూనలైనారు తప్ప, ముఖ్యమంత్రి మాట విని కాదు. ఆయన పట్ల వారి వైఖరి ఇప్పటికీ పులి బిడ్డల వలెనే వుంది. మంత్రివర్గం కూర్పు, శాఖల కేటాయింపులో కిరణ్‌కుమార్ రెడ్డి తీరు ఏ మాత్రం బాగాలేదన్న మంత్రుల భావనలో మార్పు లేదు. వీటితో తనకు సంబంధం లేదని, అంతా అధిష్టానం నిర్ణయం మీదనే జరిగిందని కిరణ్ చెప్పే మాటలను ఎవరూ విశ్వసించడం లేదు. ఢిల్లీ పేరు చెప్పి, తానే శాఖల నిర్ణయం తీసుకొన్నాడన్నది మంత్రుల అభిప్రాయం. ఈ విషయంలో ఇంటెలిజెన్స్ ఐజి మహేంద్ర రెడ్డి పాత్ర పట్ల కూడా మంత్రులు గుర్రుగా వున్నారు. రోశయ్య వున్నప్పుడే మహేంద్ర రెడ్డి, కిరణ్‌కుమార్ రెడ్డి కలిసి రాష్ట్ర పరిస్థితుల మీద కేంద్ర హోం మంత్రిత్వ శాఖకు రహస్య నివేదికలు పంపారని, వాటిలో తమనంతా వైఎస్ విధేయులుగా, అవినీతిపరులుగా చిత్రించారని అనుమానం. కిరణ్ ముఖ్యమంత్రి అయిన తర్వాత మహేంద్ర రెడ్డి పాత్ర చాలా కీలకంగా మారింది. ఢిల్లీలో అహ్మద్ పటేల్, ప్రణబ్ ముఖర్జీల వద్ద మంత్రివర్గ కూర్పుకు సంబంధించి జరిగిన కసరత్తులో కిరణ్‌కుమార్ రెడ్డి ఒక్క మహేంద్ర రెడ్డి ఇచ్చే సమాచారం మీద ఆధారపడ్డాడని తెలుస్తున్నది. మహేంద్ర రెడ్డికి రాజకీయ అవగాహన చాలా కొంచెం. తన క్రింది వారిచ్చే నివేదికల ఆధారంగా సమాచారం ఇవ్వడం తప్ప, కాంగ్రెస్ ఎమ్మెల్యేల గురించి ఆయనకు ఏమీ తెలియదు. ఎవరితోనూ పరిచయాలు లేవు. కానీ కిరణ్‌కుమార్ రెడ్డి మరొకరి సలహా సంప్రదింపులు లేకుండా కేవలం మహేంద్ర రెడ్డి మీద ఆధారపడ్డాడు. దానితో చాలా మంది మంత్రులు తమ మీద తప్పుడు నివేదికలిచ్చాడని మహేంద్ర రెడ్డి మీద కారాలు మిరియాలు నూరుతున్నారు.

మరొకప్రక్క, కిరణ్‌కుమార్ రెడ్డిని ముఖ్యమంత్రి హోదాలో గౌరవించడానికి మంత్రులు ఇష్టపడడం లేదు. సాధారణంగా ముఖ్యమంత్రి కుర్చీలో వుండే వాడిని పెద్దన్న వలె చూడడం అలవాటు. వైఎస్ కానీ, రోశయ్య కానీ వయస్సు రీత్యా, అనుభవం రీత్యా, స్థాయి రీత్యా కూడా మంత్రులందరి కంటే వున్నత స్థానంలో వుండేవారు కాబట్టి ఆ ఇబ్బంది ఎదురు కాలేదు. వారు ముఖ్యమంత్రులు కాకపోయినా

కొరవ 14వ పేజీలో





## జగన్‌తో కెవిపి తెగతెంపులు!

వైఎస్.రాజశేఖర్‌రెడ్డికి తాను ఆత్మవంటి వాడినని గొప్పగా చెప్పుకొన్న కెవిపి.రామచంద్రరావు, ఇప్పుడదే వైఎస్ కుటుంబంతో పూర్తిస్థాయి తెగతెంపులు చేసుకొన్నాడు. కాంగ్రెస్ అధినాయకత్వంతో జగన్ జరిపిన యుద్ధంలో తాను పాలుపంచుకోకుండా వెన్ను చూపినప్పుడే ఆయన మీద విమర్శలొచ్చాయి. అయితే జగన్ మేలు కోసం కెవిపి అట్లా మెలగుతున్నాడని, ముఖ్యమంత్రులతో సన్నిహితంగా మెలగుతూ జగన్ మీద కేసులు రాకుండా చూస్తున్నాడని, మంత్రులను, ఎమ్మెల్యేలను తన గుప్పెట్లో పట్టి పెట్టి, అవసరమైనప్పుడు జగన్ సైన్యంలో కలుపుతాడని చెప్పేవారు. కానీ జగన్ కాంగ్రెస్ పార్టీకి, ఎమ్పీ పదవికి కూడా రాజీనామా చేసిన తర్వాత కెవిపి ముఖం చాటేయడంతో, ఆయన మీద జగన్ వర్గానికున్న భ్రమలు తొలగిపోయాయి. తన తండ్రి స్నేహితుడిగా వేల కోట్లు సంపాదించి, అధికారం అనుభవించి, పదవులు పొంది, తనకు అవసరమైన సమయంలో ముఖం చాటేసిన కెవిపి అంటే, జగన్ ఇక్కడెగిరి అక్కడ పడుతున్నాడు. నమ్మక ద్రోహిగా, నయవంచకుడిగా తిట్టి పోస్తున్నాడు. రెండు కుటుంబాల మధ్య ఎటువంటి సంబంధాలు లేకుండా తెగతెంపులు చేసుకోవాలని, కెవిపి తన ఇంట్లో అడుగు పెడితే కూడా

కొరవ 14వ పేజీలో

# అమెరికా దుష్టబుద్ధి

అమెరికన్ పాలకులు ప్రవచించే ప్రజాస్వామ్యం, పత్రికా స్వేచ్ఛ, మానవాళి శ్రేయస్సు వంటి పడికట్టు పదాల వెనుక ఎంతటి దుర్నీతి దాగివుందో లోకానికి నగ్నంగా వెల్లడి చేసింది వికీలీక్స్ సంస్థ. ఇరాక్‌లో, ఆఫ్గనిస్తాన్‌లో, ఆఫ్రికా ఖండంలో అమెరికన్ సైన్యం చేసే దారుణాలను, దానవత్వాలను ఒళ్లు జలదరించే రీతిలో కళ్లకు కట్టింది.

వికీలీక్స్ అనేది ఒక స్వచ్ఛంద సంస్థ. ఆస్ట్రేలియా దేశానికి చెందిన జూలియన్ అసంజే అనే పత్రికా విలేఖరి దీన్ని స్థాపించాడు. వివిధ దేశాల నుంచి అమెరికన్ దౌత్యాధికారులు, సైనిక సిబ్బంది తమ ప్రభుత్వానికి పంపే నివేదికలు, వర్తమానాలు, రాజకీయ అంచనాలు, సంఘటనలపై వాస్తవాల వంటి వాటిని సేకరించి, ఇంటర్నెట్ ద్వారా లోకానికి వెల్లడి చేయడం ఈ సంస్థ కార్యకలాపం.

2006లో ఈ ఇంటర్నెట్ సంస్థను స్థాపించినప్పుడు ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. కానీ ఇరాక్, ఆఫ్గనిస్తాన్ యుద్ధాలలో అమెరికన్ సైనికులు చేసిన అకృత్యాలు, దారుణాలు, దుర్మార్గాలను వెల్లడి చేయడంతో అమెరికన్ ప్రభుత్వం ఉలిక్కి పడింది. లక్షలాది మంది అమాయక ఇరాక్ పౌరులను అమెరికన్, బ్రిటీష్ సైనికులు ఎంత క్రూరంగా హింసించిందో, మానభంగాలు చేసింది, చిత్రహింసలు పెట్టి చంపింది కళ్లకు కట్టాయి ఆ పత్రాలు. యుద్ధరంగంలో అమెరికన్ సైనికులు తమ కళ్లతో చూసిన సమాచారాన్ని నివేదికల రూపంలో ఇచ్చిన పత్రాలివి. అందువల్ల అవి అబద్ధమని, కల్పితమని చెప్పడానికి అమెరికన్ ప్రభుత్వానికి వీలు కాలేదు. హిట్లర్, ముస్సోలిని వంటి నియంతల కంటే క్రూరమైన, ఘోరమైన యుద్ధ నేరాలకు పాల్పడిన అనాగరిక దేశంగా అమెరికాను ప్రపంచ ప్రజల ముందు నిలబెట్టింది వికీలీక్స్ సంస్థ. సాధారణ పౌరులను పట్టుకొని, కళ్లకు గంతలు కట్టి, శరీరంలోని ఒక్కొక్క అవయవం మీద తుపాకీతో కాలుస్తూ రాక్షసానందం పొందిన సంఘటనలు కోకొల్లలు. మరికొందరు అమెరికన్ సైనికులు కిరాతక పద్ధతులతో ఇరాక్ పౌరుల మీద జరిపిన మానభంగ నేరాలను కూడా లోకానికి వెల్లడి చేశాయి ఈ పత్రాలు. వాటికి అమెరికన్ పాలకులు సమాధానం చెప్పాలని, సంబంధిత సైనికాధికారులను యుద్ధ నేరాల చట్టం క్రింద శిక్షించాలని ప్రపంచ ప్రజల నుంచి ఒత్తిడి వస్తున్నదిప్పుడు. ముస్లిం తీవ్రవాదం అణిచివేత పేరిట అమెరికన్ పాలకులు తమకు నచ్చని దేశాల మీద యుద్ధం ప్రకటించే దుష్టబుద్ధిని అమెరికన్ ప్రజలే ప్రతిఘటించే చైతన్యం తెచ్చాయి ఇవి.

ఇది చాలదన్నట్లు, తాజాగా వికీలీక్స్ సంస్థ వివిధ దేశాల నుంచి అమెరికన్ దౌత్యాధికారులు పంపిన నివేదికలను, దాదాపు రెండున్నర లక్షల పత్రాల రూపంలో లోకానికి అందజేసింది. సౌదీ అరేబియా రాజప్రసాదంలో జరిగే మందు విందుల చిందులు, ముస్లిం తీవ్రవాదులకు అరబ్ రాజులు అందిస్తున్న సహాయం, పాకిస్తాన్ సైన్యంలో జరిగే కుట్రలు, బ్రిటిష్ ప్రభుత్వం తీవ్రవాదుల బ్లాక్‌మెయిల్‌కు లొంగిన తీరు, భారత పాకిస్తాన్‌ల పై అమెరికన్ పాలకుల అభిప్రాయాలు, అంచనాలు, రష్యా ప్రభుత్వాధినేతలకు అంతర్జాతీయ మాఫియా ముఠాలతో వున్న సంబంధాలు... ఇట్లా చెప్పుకొంటూ పోతూ నమ్మలేని నిజాలన్నిటినీ బయటపెట్టింది వికీలీక్స్. దానితో అమెరికన్ ప్రభుత్వం తీవ్రమైన దౌత్య సంక్షోభంలో కూరుకపోతున్నది. అమెరికా ఈ సంస్థ స్థాపకుడు జూలియన్ అసంజేను లండన్‌లో అరెస్టు చేయించారు. ఆయన పై మోపిన నేరం, స్వీడన్‌లో ఒక వేశ్యతో కండోమ్ వాడకుండా శృంగారం జరపడం. ఎంత అపహాస్యమైన నేరమో చూడండి. అరెస్టు చేసి జైలులో పెడితే అయినా ఆయన కొత్త పత్రాల వెల్లడి మానుకొంటాడన్నది అమెరికన్ పాలకుల ఆశ. కానీ ఆయన జైలులో వున్న సమయంలో కూడా మరొక లక్ష పత్రా లను లోకానికి వెల్లడి చేసింది ఆ సంస్థ.

ప్రభుత్వాల వ్యవహారశైలిలో పారదర్శకత పాటించడమనేది ప్రజాస్వామిక మౌలిక లక్షణం. పైకి చెప్పేదొకటి, లోపల చేసేదొకటి అన్న రీతిలో అమెరికన్ ప్రభుత్వాలు పాటించే దుర్నీతికి పత్రికా స్వేచ్ఛ ద్వారా అడ్డుకట్ట వేయాలని జూలియన్ అసంజే వంటివారు చేసే సాహసోపేత కృషికి యావత్ ప్రపంచ మద్దతు లభించి తీరుతుంది. అరెస్టు ద్వారా దాన్ని అణిచి వేయాలనుకోవడం అమెరికన్ పాలకుల వెర్రితనం.

జమీన్‌రైతు

## జనవాణి

### సూక్ష్మంలో మోక్షం

20 ఏళ్ల క్రితం డ్వాక్రాగా అవతరించిన మహిళల పొదుపు, స్వయం సహాయక పథకం పేర్లెన్ని మార్చుకున్నా అమలులో సరైన శ్రద్ధ, అజమాయిషీ లేనందున నిర్దేశిత లక్ష్యసాధనలో చతికిలపడి ప్రభుత్వానికి తలవంపులు తెచ్చింది. పేద మహిళలను లక్షాధికారులను చేస్తామన్న సర్కారు మాటలు బడాయి బాకాలుగా మిగిలిపోయాయి. అధికార పార్టీలు పేద మహిళలను తమ ఓటు బ్యాంకుగా ముద్దు చేయడం తప్పించి ఈ పథకం అమలులో జరుగుతున్న లోపాలను, అక్రమాలను, అవినీతిని పట్టించుకున్న పాపాన పోలేదు. వడ్డీ భారంతో, బలవంతపు వసూళ్లతో మహిళల్లో గత్యంతర ఆత్మహత్యలు జోరందుకోవడంతో సూక్ష్మఋణ సంస్థల దారుణాలను కట్టడి చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఓ అశక్త, అసమగ్ర ఆర్డినెన్స్‌ను జారీచేసి చేతులు దులుపుకొంది. దీంతో సమస్య రోడ్డుకు, కోర్టుకు ఎక్కడం తప్ప పరిష్కారం, న్యాయం పూర్తిగా లభ్యం కాలేదు. ముఖ్యంగా రిజర్వుబ్యాంకు, కేంద్ర ప్రభుత్వం చొరవ చూపితేనే బాధిత మహిళలకు తక్షణ విముక్తి లభిస్తుంది.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

### ఉన్నతాధికారులకు ఇది తగునా?

గతంలో మన జిల్లాలో శంకరన్, అర్జున్‌రావు, సుజాతరావు, జన్నత్ హుస్సేన్, రాజశేఖర్ వంటి కలెక్టర్లు పని చేసి ప్రజల మనస్సులలో నాటుకొనిపోయారు. ఈ మధ్య కాలంలో జిల్లాలో పని చేసిన, చేస్తున్న జిల్లా ఉన్నతాధికారులు తమ స్థాయికి తగినట్లు వ్యవహరించడం లేదు. జిల్లాలోని ఇతర ప్రాంతాలకు క్యాంపులకు వెళ్లినప్పుడు ప్రభుత్వ కార్యక్రమాల్లో పాల్గొంటూనే ఎమ్మెల్యేలు, మాజీ ఎమ్మెల్యేలు, సంపన్నుల ఇళ్లకు అల్పాహారాలు, భోజనాలకు వెళ్లి అక్కడ పత్రికావిలేకరుల సమావేశాలు నిర్వహిస్తున్నారు. ఈ సమయాల్లో డివిజనల్, మండలస్థాయి అధికారులు వారిని అనుసరించక తప్పడం లేదు. దీనివల్ల ఎన్నో ఇబ్బందులుంటాయి. ఇటువంటి వ్యవహారాలకు ఉన్నతాధికారులు దూరంగా వుంటేనే వారి విలువ పెరుగుతుంది.

పి.శ్రీరాములు — కావలి

### రజక మంత్రికి అభినందనలు!

దక్షిణ భారతదేశంలోనే రజక కులం నుంచి ఎమ్మెల్యేగా గెలిచి రాష్ట్ర మంత్రిగా ప్రమాణస్వీకారం చేసిన వరంగల్ ఎమ్మెల్యే బస్వరాజు సారయ్యకు అభినందనలు. అట్టడుగు వర్గమైన రజక కులానికి రాజ్యాంగ హక్కులు, రక్షణ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

13-12-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

#### సంస్కృత కళాశాల

వెనుక జానకిరామి రెడ్డికి ఇవ్వడం లేదన్న ఉపాధ్యాయ పదవి ఆ దుమ్ము దుమారం అణిగిపోయిన తర్వాత నేడు మనమప్పుడనుకొన్న ఇంగువ కృష్ణయ్య గారి బంధువుకే లభ్యమైంది. ఇప్పుడు జానకిరామి రెడ్డి గారు ఉచితంగా సేవచేస్తానంటున్నాడు. కళాశాలకు ఉచిత సేవ కూడా చేదేమో?

#### పువ్వులు - రాళ్లు

జైలుకు పోయినవాళ్ల పోతున్న వాళ్ల నెత్తిన పువ్వులు జల్లకుంటే మానింది రాళ్లన్నా విసరకుండా వుండరాదా? స్వయంగా చేయలేరు. చేసే వాండ్లను చూసి ఓర్వలేమి. ఇది లోక సహజమే.

#### రాఘవయ్య నెల్లూరులోనే...

వెన్నెలకంటి రాఘవయ్య గారు 23వ తేది నెల్లూరులో సత్రం వద్ద సత్యాగ్రహం జరిపెదరు. జిల్లాలో వారికి ఇష్టమొచ్చిన చోట జరుపవచ్చునని ఉత్తర్వు రాష్ట్ర సంఘము వారు బంపినారు.

#### ఇది లంచమా?

ఇంజనీరు ఆఫీసులో ఒక గుమస్తా లంచానికి అయిదు రూపాయల నోటు పోస్టులో పంపితే దైవవశాత్తు ఇది ఇంజనీరు గారికే దొరికిందట కానీ ఇంకా ఆ గుమస్తాను విచారించిన పాపానబోలేదు.

#### విశ్వమోహిని

నెల్లూరులో ఈ ఫిలిం ఇంకా వుంది. ఇంకా చూడవలసిన రసజ్ఞులంతా దర్శించి తెలుగు ఫిలిం పరిశ్రమకు దోహదమివ్వండి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

9-12-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఏ.సికి మంత్రిత్వం

ఏ.సి.సుబ్బారెడ్డి నేడోరేపో మంత్రి అవుతారనే వదంతి ఆంధ్ర రాజధానిలో కంటే, నెల్లూరులో తీవ్రంగా వ్యాపించి, అడిగేవారికి సమాధానం చెప్పలేక పోతున్నాము.

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నిక రచ్చ లేకుండా జరిగిపోవడం, సుబ్బారెడ్డి తన తలపై వున్న టోపీనిదీసి పళ్లంరాజు నెత్తిన బెట్టడం, సంజీవయ్య – సుబ్బారెడ్డి ఒకరినొకరు ఒరుచుకుంటూ సంచరిస్తూ బయటివారికి ఎంతో సన్నిహితులుగా కనిపించడం, సుబ్బారెడ్డి సంజీవయ్య గారితో చాలాసేపు సంప్రదింపులు జరపడం, కాంగ్రెస్ అధ్యక్షుడు సంజీవరెడ్డి గారి సమక్షంలో ఇది పరిష్కారమైపోతుందని వార్తలు రావడం, క్రొత్తగా మంత్రులు కాగలరనే వారి జాబితాలో దిన పత్రికలు సుబ్బారెడ్డి గారి పేరు చేర్చడం – ఈ అన్ని కారణాల వల్ల సుబ్బారెడ్డి గారు మంత్రి కాగలరనే అభిప్రాయం నెల్లూరీయులలో, ముఖ్యంగా వారి అభిమాన కోటిలో ప్రబలంగా ఏర్పడింది.

### సిద్దయ్య నాయుడు కుమార్తె పెండ్లి!

పెద్ద – చిన్న, పేద – సాధు అందరికీ ఆశ్రయమిచ్చిన వాడు, వితరణ ఖని, గూడూరు మునిసిపల్ మాజీ అధ్యక్షుడు పసుపులేటి సిద్దయ్య నాయుడు గారి కుమార్తె సౌభాగ్యవతి కృష్ణవేణికి – తిరుపతి వాస్తవ్యులు సుబ్రమణ్యం నాయుడు గారి కుమారులు, అనుకూలుడు, సౌమ్యవర్తనుడు, చిరంజీవులు ఐఎస్ వాసు గారికి 4వ తేది ఆదివారం తిరుపతి సమీపంలో తిరుచానూరులో దేవస్థానం సత్రం నందు వివాహం జరిగింది. నాయుడు గారి సమాన హోదాలోని మిత్రులు యెంతమందో, అంత మంది ఆశ్రితవర్గం, బంధువర్గం, అందరూ కలిసి అంత పెద్ద సత్రం పట్టలేదు. మహా మహంటి వారి పెండ్లి జరిగినా ఆ సత్రంలో పెండ్లికి వచ్చినవారు ఏ మూలకో సరిపోతారు. ఈ పెండ్లికి వచ్చినవారు సత్రం పట్టక బయట కూర్చున్నారు చాలా మంది. దీనిని బట్టి అందుబాటులో లేనిచోట జరిగినా, పెండ్లి యెంత విజయవంతముగ జరిగినదో వూహించుకోవచ్చు.

# నెల్లూరు ముచ్చట్లు

## రొట్టెల పండుగ

మత సామరస్యానికి ప్రతీకగా నెల్లూరు బారాషహీద్ దర్గా వద్ద జరిగే రొట్టెల పండుగ ఈ నెల 17వ తేది మొదలై 19వ తేదీతో ముగుస్తుంది. వాస్త వానికి మొహరం పండుగ అయిన రెండో రోజు అంటే 19వ తేది రొట్టెల పండుగ జరగాలి. కానీ జనం ఎక్కువగా వచ్చేస్తుండడంతో పండుగ చేయకూడని రోజుల్లోనూ అది జరిగిపోతుంది.

దర్గా దగ్గర అభివృద్ధి పనులకు ప్రభుత్వం నుంచి నిధులు విడుదల చేయించకుండా ఇక్కడకు వచ్చే భక్తులు హుండీలో వేసిన మొత్తాలను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఖర్చు పెట్టేస్తు న్నట్లు గగ్గోలుగా వుంది. అడిగేవారు లేరని ఇలా చేస్తే ఎలా ఎమ్మెల్యే గారు!

## పాపం... అయ్యోరు!

నెల్లూరు నగర కాంగ్రెస్ అధ్యక్షుడు చాట్ల నరసింహారావుకు తీవ్ర అవమా నం జరిగింది. కానీ ఈ విషయమై ఆయన నోరు మెదపక సర్దుకుపోయి మంచి అయ్యోరనిపించారు. తన జిల్లా పర్య టనలో భాగంగా ఆర్థిక మంత్రి 4వ తేది నెల్లూరు వచ్చారు. 5వ తేది ఇందిరా భవన్‌లో పత్రికా విలేకరుల సమావేశం నిర్వహించారు. నగర కాంగ్రెస్ అధ్యక్షుని హోదాలో ఆయనకు మంత్రి ప్రక్కన కూర్చొనే అవకాశం ఇవ్వాలి. కానీ రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఆయన్ను నిలువు కాళ్లపై నిలబెట్టారు. ఆనం సన్నిధిలో ఎన్నో అవమానాలను ఎదుర్కొన్న నరసింహారావు సమావేశం అయ్యేవరకు నవ్వలేక ఏడ్వలేక ముఖాన్ని కందగడ్డలా పెట్టుకొని నిలబడడం చూసే వారికి 'అయ్యో' అనిపించింది.

## ఆయన చెప్పినట్లు వింటున్న ఆమె!

నెల్లూరు రాజరాజేశ్వరమ్మ దేవస్థానంలో పరిస్థితులు నానాటికీ తీసికట్టు నాగంభట్టులా తయారవుతున్నాయి. దేవస్థానానికి వంశపారంపర్య ధర్మకర్త వున్నా ఆయన మాటను వినేవారు లేకుండా పోయారు. ఈ మధ్య ఇఓగా బాధ్యతలు తీసుకొన్న మాధవి ప్రతి విషయంపై మాజీ కార్పొరేటర్ సన్నపరెడ్డి పెంచలరెడ్డి సలహా అడిగి ఆయన ఓకె అన్న ఫైళ్ల మీద సంతకాలు పెడుతోం దట. అన్ని నిర్ణయాలు ఆయన్ను అడిగే తీసుకొంటుందట. ఇటీవల దేవస్థానంలో అమ్మవారికి భక్తులు సమర్పించిన ఖరీదైన పట్టు చీరలను స్వంత మనుషులకు నామమాత్రపు ధరకు ఇచ్చేయడంతోపాటు మహిళా భక్తులపై అతిగా ప్రవర్తిస్తున్న ఆలయ సిబ్బందిపై చర్యలు లేకపోవడం విమర్శలకు దారి తీస్తుంది.



## ఉత్తమ ఆసుపత్రులు మనవే!

రాష్ట్రంలో అన్ని ప్రభుత్వ ఆసుపత్రులలో ఉత్తమమైనవి ఏవని నిర్వహించిన సర్వేలో నెల్లూరు రేబాలవారి వీధి లోని చిన్న పిల్లల ఆసుపత్రికి ప్రధమ స్థానం, క్షయాసుపత్రికి ద్వితీయ స్థానం లభించింది. పనితీరు ఏమాత్రం మెరుగు పడని పెద్దాసుపత్రి మాత్రం 16వ స్థానం దక్కించుకొంది. చెప్పుకోతగ్గ స్థాయిలో వైద్య సేవలు అందని మన నెల్లూరు ఆసుపత్రులకే ఉత్తమమైనవని అవార్డు రావడమంటే మిగతా ఆసుపత్రులు ఏ విధంగా వున్నాయో అర్థం చేసుకోవచ్చు.

## సోనియాను కలసిన బూదాటి రాధయ్య!

శాసన మండలి సభ్యుడు బూదాటి రాధయ్య 6వ తేది ఢిల్లీలో కాంగ్రెస్ పార్టీ అధినేత్రి సోనియాగాంధీని కలిశారు. రాష్ట్ర మంత్రి వర్గంలో చేనేతలకు స్థానం లభించని విషయాన్ని ఆమె దృష్టికి తీసుకెళ్లారట. రాధయ్యకు మంత్రి పనబాక లక్ష్మి సహకారం అందించడం వల్ల ఆయన సోనియాగాంధీని కలవగలిగారు.

## సిపిఐ ఆఫీసుకు ఆర్థిక మంత్రి!

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి 6వ తేది రైల్వే ఫీడర్స్ రోడ్డులోని సిపిఐ ఆఫీసును సందర్శించారు. సిపిఐ జిల్లా కార్యదర్శి పముజుల దశరధరామయ్య ఆయనకు హార్థిక స్వాగతం పలికి కొండవీటి చాంతాడంత సమస్యల జాబితా ఇచ్చారు. దీన్ని పరిశీలించిన మంత్రి నాలా నెల్లూరుకు నిధులు పారిస్తున్న మంత్రి ఇంకొకరు లేరు దశన్నా అని ఆయన్ను సంతృప్తి పరిచారు.

## ఎప్పుడైనా... ఎక్కడైనా!

ఇదేమీ సినిమా పేరు కాదు. నెల్లూరులో దొంగతనాలు ఎప్పుడైనా... ఎక్కడైనా జరగవచ్చని పోలీసు అధికారులు బంగారంగళ్ల వారిని హెచ్చరిస్తూ చేసిన వ్యాఖ్య. రంగనాయకులపేటలోని ది నెల్లూరు బులియన్ మర్చంట్స్ అండ్ పాన్ బ్రోకర్స్ అసోసియేషన్ హాలులో డిఎస్పీ రాధిక నేతృత్వంలో వ్యాపారస్తులకు అవగాహన సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో ఆమె మాట్లాడుతూ నెల్లూరులో నేరస్తుల సంఖ్య పెరిగిపోతోంది. ఎప్పుడైనా ఎక్కడైనా నేరాలు జరిగే అవకాశం వుంది. వ్యాపారులు దొంగతనాలు జరగకుండా అప్రమత్తంగా వుండాలి. అంగళ్ల షట్టర్లకు తాళాలు జాగ్రత్తగా వేయాలి... తీయాలి. నమ్మకమైన వారిని పనిలో పెట్టుకోవాలి. పగటి పూటే విలువైన వస్తువులతో ప్రయాణం చేయండి. అంగళ్లలో రాత్రిపూట పనిచేసేలా సిసి కెమెరాలు పెట్టుకోమని చెప్పడంతో ఇవన్నీ మాకు తెలియదా అని బంగారంగళ్ల వాళ్లు వ్యాఖ్యానిస్తూ సమావేశం నుంచి బయటకు రావడం కనిపించింది.

### చందాదారులకు మనవి

- ☞ **చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.**
- ☞ **మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.**
- ☞ **'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.**
- ☞ **చెక్కులు స్వీకరించబడవు.**

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
**పొగతోట, నెల్లూరు - 524 001**
**ఫోన్: 0861 - 2327354**
**సెల్: 98489 66190**



**జిల్లాలో హెచ్ఐవితో బాధపడే గర్భిణులకు అత్యధికంగా కాన్పులు చేసినందుకుగాను జిల్లా కలెక్టర్ రాంగోపాల్ చేతుల మీదుగా ప్రశంసాపత్రాన్ని అందుకొంటున్న నెల్లూరు జూబ్లీ హాస్పిటల్ డాక్టర్ రాజమ్మ.**

## వాటర్ వర్క్స్ విభాగంలో జనరేటర్లు!

కార్పొరేషన్ వాటర్ వర్క్స్ విభాగంలో కోటి రూపాయలు వెచ్చించి కొనుగోలు చేసిన రెండు జనరేటర్లను 3వ తేది బిగించారు. విద్యుత్ సరఫరా ఆగిన సమయంలో వాటర్ వర్క్స్ విభాగం నుంచి వేదాయపాళెం, అయ్యప్పగుడి, వెంగళరావు నగర్‌లతోపాటు పొదలకూరురోడ్డులోని వివిధ ప్రాంతాలకు నీటి సరఫరా ఆగి జనం ఇబ్బంది పడాల్సి వస్తుంది. మిగతా వస్తువుల వలె కాకుండా ఈ జనరేటర్ల నిర్వహణను కార్పొరేషన్ అధికారులు చక్కగా చూడాల్సి వుంది.

## ఎల్ఎల్ఎఫ్ స్కూల్ విద్యార్థి ప్రతిభ!

నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్‌లో ఎనిమిదవ తరగతి చదివే విద్యార్థి బి.అక్షయ్ రాష్ట్ర స్థాయి స్కూల్‌గేమ్స్‌లో క్రికెట్ పోటీలకు ఎంపికయ్యాడు. ఈ విద్యార్థిని అభినందించి స్కూల్ డైరక్టర్ ఇ.కృష్ణచైతన్య అతనికి క్రికెట్ కిట్‌ను బహుకరించారు.

## స్మైల్ దంత వైద్యశాల 11వ వార్షికోత్సవం

నెల్లూరు రమేష్‌రెడ్డి నగర్‌లోని స్మైల్ సూపర్ స్పెషాలిటీ దంత వైద్యశాల 11వ వార్షికోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా హాస్పిటల్ మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ జి.కిరణ్ మాట్లాడుతూ నెల్లూరులో ప్రప్రథమంగా ఐఎస్ఓ 9001 – 2000 గుర్తింపు పొందిన తమ దంత వైద్యశాలలో మధుమేహం, రక్తపోటు, గుండెజబ్బులున్న వారి దంత చికిత్స నిమిత్తం ప్రత్యేక విభాగం, దంతాలకు అల్ట్రాసోనిక్ చికిత్స చేస్తున్నామన్నారు. వార్షికోత్సవం సందర్భంగా డిసెంబరు 1వ తేది నుండి 31వ తేది వరకు సిరామిక్ కట్టుడు పళ్లపై 30 శాతం రాయితీనిస్తూ, పళ్లకు గ్యారంటీ ఇచ్చే చికిత్స చేస్తున్నామన్నారు. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులతోపాటు ఎలక్ట్రిసిటీ ఉద్యోగులకు రీయంబర్స్‌మెంట్ సదుపాయంతోపాటు ఉద్యోగులు నెలసరి వాయిదాల్లో వైద్య ఖర్చు చెల్లించే సదుపాయం తమ దంత వైద్యశాలలో వుందని డాక్టర్ కిరణ్ చెప్పారు.

## తిరుపాల్‌రెడ్డి అన్న, వస్త్ర దానాలు!

నెల్లూరు నగరంలో ప్రముఖ ఫైనాన్స్ వ్యాపారి చెరుకుపల్లి తిరుపాల్‌రెడ్డి, రమణమ్మ దంపతుల పెళ్లిరోజును పురస్కరించుకొని 5వ తేది బాలాజీనగర్ లోని విశాలాక్షి వృద్ధుల ఆశ్రమంలో అన్న, వస్త్ర దానాలు చేశారు. కనిపెంచిన తల్లి తండ్రులు వృద్ధాశ్రమాల్లో వుండాల్సి రావడం పట్ల తిరుపాల్‌రెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు. ఈ స్ఫూర్తితోనైనా తిరుపాల్‌రెడ్డి ఏదైనా సామాజిక సేవా ప్రాంగణం ప్రారంభిస్తే బాగుంటుందేమో!

## కోటికి కళాంజలి అవార్డు!

సుప్రసిద్ధ సినీ సంగీత దర్శకుడు కోటిగా సుపరిచితుడైన కోటేశ్వరరావుకు కళాంజలి అవార్డును ప్రదానం చేయనున్నారు. కళాంజలి సంస్థ 22 వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 17వ తేది టౌన్ హాల్‌లో ఈ అవార్డు ప్రధానం చేస్తామని సంస్థ అధ్యక్షుడు అనంత్ చెప్పారు.

## చిన్న చేపను పట్టారు!

నెల్లూరు ఎసిబి అధికారులు ఆలస్యంగా దాడిచేసినా గిరిజన హాస్టళ్లలో జరుగుతున్న అవినీతి అక్రమాలన్నింటినీ బయట పెట్ట గలిగారు. గొలగమూడి గిరిజన ఆశ్రమ పాఠశాలకు సంబంధించి హాస్టల్‌పై దాడులు చేస్తే అక్కడ జరుగుతున్న అవినీతి అక్రమాలను లెక్కగట్టను ఎసిబి అధికారులకు ఒకటిన్నర రోజు పట్టింది. ఈ హాస్టల్‌కు సరఫరా చేసే బియ్యం, నూనె, కందిపప్పు, మినపప్పు, ఉప్మా రవ్వ, కూరగాయలు అన్నింటా అవినీతే. ఈ విషయాలన్నీ చూసి ఎసిబి డిఎస్పీ శరత్‌బాబు ఆశ్చర్యపోయారు.

కొరవ 14వ పేజీలో

# మంత్రి రామనారాయణ స్వాగతానికి జనమేరి?

## అందరికీ ఫోన్లు - అయినా రాలేదు!


ఆర్థిక మంత్రిత్వం స్వీకరించి తొలిసారిగా ఎసిసెంటర్‌కు వచ్చిన రామనారాయణ.

ఆనం సోదరులు తమ ఆధ్వర్యంలో చిన్న కార్యక్రమం చేసినా పక్కా ప్రణాళికతో రూపొందించడం వల్ల ఆ కార్యక్రమం అబ్బా అనిపించడం ఆనవాయితీ. కానీ ఆర్థిక మంత్రి అయ్యాక తొలిసారిగా 4వ తేది నెల్లూరు వచ్చిన ఆనం రామనారాయణరెడ్డికి ఘనస్వాగతం పలకడంలో మాత్రం విఫలమయ్యారు. దీనికి పార్టీ నాయకుల్లో, కార్యకర్తల్లో బ్రదర్స్‌పై గూడుకట్టుకొన్న నిస్తేజం కారణమని చెప్పుకోక తప్పదు. రామనారాయణరెడ్డి 4వ తేది సాయంత్రం ఎసి సెంటర్‌కు వస్తున్నారని నగరంలో ఆటోల ద్వారా ఊదరగొట్టే ప్రచారం చేశారు. ఇటు వివేకానందరెడ్డి కార్యదర్శి, అటు రామనారాయణరెడ్డి కార్యదర్శి, వారి వర్గీయులైన చిన్నచితకా నాయకులు, ముఖ్య కార్యకర్తలకు కూడా ఫోన్‌చేసి ఈ కార్యక్రమానికి హాజరు కమ్మని వర్తమానమిచ్చారు. సహజంగా ఎసి సెంటర్‌లో బ్రదర్స్ నేతృత్వంలో ఏ కార్యక్రమం జరిగినా ట్రంకురోడ్డంతా లైటింగ్ వేసేస్తారు. ఈసారి కేవలం కనకమహల్ నుంచి ఎసి సెంటర్ వరకు బిల్డింగులపై సీరియల్ సెట్లు వేశారు. ఎసి సుబ్బారెడ్డి విగ్రహాన్ని, ఈ సెంటర్‌లోని వినాయకుడి గుడిని ప్రత్యేకంగా అలంకరించారు. మంత్రి వస్తాడని ప్రకటించిన ఆరు గంటల ప్రాంతంలో మామూలుగా వుండే జనాలకంటే మరీ తక్కువస్థాయిలో ఈ సెంటర్‌లో జనమున్నారు. కాంగ్రెస్ ఎన్నికల గీతాలతో మైకులు అదే పనిగా హోరెత్తిస్తుండగా రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో మంత్రి రామనారాయణ రెడ్డి ఎసి సెంటర్‌కు చేరుకొన్నారు. పోలీసుల హడావుడి తప్ప సెంటర్‌లో ఎప్పుడూ కనపడే వివేకానంద రెడ్డి, భానుశ్రీ, చాట్ల నరసింహారావు, పిండి సురేష్, సంక్రాంతి కళ్యాణ్, జరీనా సుల్తానా, మునిసిపల్ కమిషనర్ ఆంజనేయులు, కోటమ్మ, మునాఫ్ కొంతమంది కాంట్రాక్టర్లు బొకేలు, కాంగ్రెస్ కండువాలు మంత్రి మెడలో వేశారు. ప్రత్తి బాబు, తుమ్మల సుబ్బారెడ్డి మంత్రిని వినాయకుడి గుడి దగ్గరకు తీసుకెళ్లి ప్రత్యేక పూజ చేయించారు. ఆర్థిక మంత్రికి అదిరిపోయే స్వాగతం వుంటుందని భావించిన వారు ముక్తసరి స్వాగతం చూసి ఆశ్చర్యపోయారు. ఫోన్లు చేసినా రాని ముఖ్య కార్యకర్తల తాలుకు వివరాలు రాబట్టడంలో వివేకా పడ్డాడు.



# చెరుకు రైతుల చేదు బ్రతుకులు

- గిట్టుబాటు ధరలేక అల్లాడుతున్నారు


చెరుకు రైతులకు సమస్యగా మారిన కోవూరు షుగర్ ఫ్యాక్టరీ.

కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి తోడు ప్రభగిరిపట్నంలోని షుగర్ ఫ్యాక్టరీ రైతులకు విత్తన సబ్సిడీ క్రింద ఏడుకోట్ల రూపాయల బకాయిలు చెల్లించాల్సి వుండడంతో రైతులు విలవిలలాడిపోతున్నారు. కోవూరు షుగర్ ఫ్యాక్టరీ మూడు కోట్లు, ప్రభగిరిపట్నంలోని ఫ్యాక్టరీ నాలుగు కోట్ల రూపాయల మేర రైతులకు చెల్లించాల్సి వుంది. ఈ సీజన్‌లో కోవూరు షుగర్ ఫ్యాక్టరీ పరిధిలో ఆరువేల ఎకరాలకు పైగా చెరుకు సాగు చేశారు. దుక్కిదున్నిన దగ్గర నుంచి కటింగ్, రవాణాకు ఎకరాకు రమారమి 37వేల రూపాయల ఖర్చుంటుంది. ఎకరాకు నాలుగు టన్నుల విత్తనం అవసరమవుతుంది. గత ఏడాది 50వేల టన్నుల చెరకును రైతులు కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి తరలించారు. టన్ను చెరకుకు 2,100 రూపాయల లెక్కన చెల్లించాల్సి వుండగా యాజమాన్యం 1350 రూపాయలే చెల్లించింది. ఈ ఏడాది ఏడువేల ఎకరాల్లో చెరకును రైతులు పండించారు. ఖర్చులు పెరిగినందున టన్నుకు 2,500 రూపాయలు చెల్లించాలని రైతులు కోరుతున్నారు. దీనికి తోడు కటింగ్, రవాణా ఖర్చులు ఫ్యాక్టరీ భరించాలని కోరుతున్నారు. అన్నీ ఖర్చులు కలుపుకొని టన్ను 3,500 రూపాయలు చెల్లిస్తేగానీ రైతులు కోలుకోలేరని జిల్లా రైతు సంఘం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. కానీ రైతుల మొరవినే వారే లేరు. అన్నీ అనుకూలిస్తే ఎకరాకు సరాసరి 25 టన్నుల దిగుబడి వస్తుంది. ఇది పెట్టుబడులకే సరిపోతుండడంతో చెరుకు రైతుల బతుకులు చేదవుతున్నాయి.

# ఖజానాకు ఢోకాలేదు


విలేఖరులతో మాట్లాడుతున్న రామనారాయణరెడ్డి.

రాష్ట్రంలో పేద, మధ్యతరగతి వర్గాల ప్రయోజనాలకు సంబంధించి పథకాలు అమలు చేయడానికి ఎటువంటి ఆర్థిక ఇబ్బందుల్లేవని రాష్ట్ర ఆర్థిక, ప్రణాళిక శాఖా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. మంత్రి పదవి స్వీకరించాక నెల్లూరు వచ్చిన ఆయన ఇందిరాభవన్‌లో విలేకరులతో మాట్లాడారు. ఆర్థిక శాఖ అత్యంత ప్రతిష్టాత్మక శాఖ. దీని ద్వారా నిధులు విడుదల చేయడమేకాక అన్ని శాఖల సమన్వయంతో రాబడులలో లోటుపాట్లు తొలగించుకొని నిధులను రాబట్టుకోవడం, వసూలు చేసిన వాటిని దుర్వినియోగం కాకుండా సక్రమంగా వినియోగించడం జరుగుతుందన్నారు. జిల్లాకు వచ్చిన ప్రతిసారి ప్రజా విజ్ఞప్తులు స్వీకరించి ఆ సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానన్నారు. జిల్లాలో రైతాంగం ప్రయోజనాలు, సంక్షేమ కార్యక్రమాలలో పేద, మధ్యతరగతి వర్గాల సమగ్ర అభివృద్ధి పారిశ్రామిక మౌలిక వసతులు సమకూర్చుకోడానికి ఇతర శాఖల మంత్రుల సహకారం తీసుకొంటానన్నారు. ప్రభుత్వం, ఉద్యోగస్తులు వేరుకాదు. అందువల్లే తాను ఆర్థిక మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తర్వాత తొలి సంతకం ఉద్యోగస్తుల 1485 కోట్ల రూపాయల మేర డిఏ ఫైలు పైనే చేశానన్నారు. 2004 ముందు అప్పటి ప్రభుత్వం ఉద్యోగ నియామకాలపై బ్యాన్ విధించినా వైఎస్ రాజశేఖర్ రెడ్డి ముఖ్యమంత్రి అయ్యాక 35వేల మంది పోలీసుల నియామకం, విద్యాశాఖలో 85వేల ఉద్యోగాలు, మునిసిపాలిటీల్లో 4,300 మంది సిబ్బంది ఖాళీలను భర్తీ చేశామన్నారు. లైలా తుఫాను బాధితులకు రాష్ట్రంలో 83 కోట్ల రూపాయలు విడుదల చేయగా జిల్లాలో తొమ్మిది కోట్ల రూపాయలు వ్యవసాయ, ఇరిగేషన్ శాఖల ద్వారా తాత్కాలిక మరమ్మత్తులకు మంజూరు చేసినట్లు మంత్రి స్పష్టం చేశారు.

# ఓటర్ల జాబితాల్లోని లోపాలు సరిదిద్దండి!

ఓటర్ల జాబితా సవరణలపై రాష్ట్ర ఎన్నికల సంఘం అధికారి హరిప్రీత్‌సింగ్ ఈ నెల 4వ తేది గోల్డెన్ జూబ్లీహాలులో అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించారు. కొత్తగా ఓటర్లను చేర్చడంతో గతంలో రూపొందించిన ఓటర్ల జాబితాలో చోటుచేసుకొన్న లోపాలను తప్పనిసరిగా సరిచేయాలని ఆయన సూచించారు. ప్రభుత్వ సిబ్బందితోపాటు రాజకీయ పార్టీలు పోలింగ్‌బూత్‌ల వారీగా ఏజెంట్లను ఏర్పాటుచేస్తే సవరణలు మరింత సులభంగా చేయవచ్చని అభిప్రాయపడ్డారు. జిల్లాలో 45 మండలాలకు తొమ్మిది అసెంబ్లీ నియోజకవర్గాలుండగా నెల్లూరు రూరల్ మండలంలో రెండు అసెంబ్లీ నియోజకవర్గాలు వున్న కారణంగా ఇబ్బందులు కలుగుతున్నాయని వివిధ రాజకీయ పక్షాలకు చెందిన నేతలు ఎన్నికల అధికారి దృష్టికి తెచ్చారు. సిబ్బంది కొరత కారణంగా ఓటరు జాబితాను సక్రమంగా రూపొందించడంలో ఇబ్బందులు ఏర్పడుతున్నాయని వివరించారు. ఓటర్ల నమోదు, జాబితా సవరణ కోసం ఎక్కువ మంది సిబ్బందిని నియమించాలని కోరారు. ఓటరు జాబితాను రాజకీయ పక్షాలకు అందజేయడంలో నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని, బహుజన సమాజ్ పార్టీ నగర ఇన్‌ఛార్జి యనమల నాగేశ్వర రావు ఎన్నికల సంఘం అధికారికి చెప్పారు. ఈ వ్యవహారమై తీరుమార్చుకోమని సింగ్ సలహా ఇచ్చారు.

### ● పెన్నా వారధి మళ్లీ కొట్టుకపోవడం....

# సిగ్గుతో తలదించుకోవాల్సిన విషయం!



పెద్ద పెద్ద సిమెంటు బండలు వేసినా నిలువలేదేమి?

పెన్నా వారధి మళ్లీ కొట్టుకపోయింది. గత నెల 20తేది పడిన గండికి అధికారులు చేయించిన మరమ్మత్తులు వృధా అయిపోయాయి. తుఫాను ప్రభావం వల్ల పెన్నకు వచ్చిన చిన్నపాటి నీటి ప్రవాహాన్ని తట్టుకోలేక పోయిందది. అధికారులు రాజకీయవాదులు సిగ్గుతో తలదించుకోవాల్సిన పరిస్థితి ఇది. కంప్యూటర్లు, క్యాలుక్‌లేటర్లు కూడా లేని రోజుల్లో, కనీసం సున్నం కూడా వాడకుండా రాళ్లు కుప్పపోసి సర్ ఆర్థర్ కాటన్ దొర నిర్మించిన వారధి, నూటపాతికేళ్లపాటు నెల్లూరు నగరాన్ని ముంచెత్తే వరదలొచ్చినా తట్టుకొని నిలబడితే, ఈ ఆధునిక కాలంలో ఇంజనీర్లు తమ మేధాశక్తినంతా వినియోగించి చేసిన చిన్నపాటి పూడిక పని కూడా నీటి చెమ్మకు కరిగిపోవడం సిగ్గుమాలిన తనం కాక మరేమనాలి?

అంతకంటే వికారం కల్గించే విషయం – ఈ వారధి పూడిక పనుల పేరుతో కోటిన్నర రూపాయలు కొల్లగొట్టడానికి అధికారులు చేసిన నీచమైన ప్రయత్నం. వారధి పునర్నిర్మాణంలో భాగంగా చేసిన త్రవ్వకాల వల్ల దానికి గండి పడిందన్నది అందరికీ తెలిసిన సంగతే. అట్లా నష్టం జరిగినప్పుడు, దాని క్రింది ఆయకట్టుకు ఇబ్బంది లేకుండా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయడం కూడా పునర్నిర్మాణ కాంట్రాక్టర్ బాధ్యత. ఇపిసి ఒప్పందంలో ఆ మేరకు స్పష్టమైన షరతులున్నాయి. అదే కాంట్రాక్టర్ చేత గండిని పూడిపించడం అధికారుల బాధ్యత. కానీ ఇంజనీర్లు శవాలను పీక్కొని తినే రాబంధుల వలె వ్యవహరించారు. వారధికి గండి పడగానే, దాని పేరుతో ఎంత దొరికితే అంత బొక్కడానికి హేయమైన ప్రయత్నం చేశారు. గండి పూడ్చే పనిని నీటి వినియోగదారుల సంఘం అధ్యక్షుడు చంద్రశేఖర్‌రెడ్డికి నామినేషన్ మీద అప్ప చెప్పినట్లు రికార్డు సృష్టించారు. కానీ కృష్ణపట్నం ఓడ రేవు యాజమాన్యాన్ని ఒప్పించి, వారి చేత ఉచితంగా పనులు జరిపించారు. పెద్ద పెద్ద సిమెంటు బండలు భారీ క్రేన్ల సహాయంతో తెప్పించి, గండి పడిన గుంటలను పూడ్పించారు. అయితే వాటికి బలం చేకూర్చడానికి సరైన పాళ్లలో సిమెంటు పదార్థాలు వాడి వుంటే మళ్లీ వరద వచ్చినా వారధి నిలబడి వుండేది. కానీ నామినేషన్ మీద పనులు తీసుకొన్న నీటి వినియోగదారుల సంఘాధ్యక్షుడు, అక్కడే గుంట త్రవ్వగా వచ్చిన ఇసుక, బంక మట్టితో ఆ సిమెంటు బండలను కప్పి పెట్టేశాడు. చిన్నపాటి నీటి ప్రవాహానికే ఆ మట్టి, ఇసుక కొట్టుకపోయాయి. బండలు వదులై దిగువకు జారిపోయాయి. దానితో వారధి పరిస్థితి యధా ప్రకారం తయారయ్యింది.

ఆంధ్రజ్యోతి దిన పత్రిక విలేకరి ఈ దుర్మార్గాన్ని కనిపెట్టి, ప్రముఖంగా ప్రకటించడంతో అధికారులు ఉలిక్కి పడ్డారు. గండి పూడికకు ఎంత ఖర్చు అవుతుందో లెక్కవేయడానికి మాత్రమే బిల్లు తయారు చేశాము తప్ప, నామినేషన్ మీద

కొరవ 14వ పేజీలో

# పుట్టినూరికి పుష్కలంగా సాయం చేస్తున్న డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి!



జననీ జన్మభూమిశ్చ... స్వర్గాదపి గరియసి అన్న ఆర్యోక్తికి అనుగుణంగా తన జీవన యానం సాగిస్తున్న వ్యక్తి డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి. ఆయన స్వగ్రామం వెంకటాచలం మండలంలోని నిడిగుంటపాళెం. అమెరికాలో గుండె డాక్టర్‌గా ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచిన డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి పుట్టిన ఊరుపై పుట్టెడంత అభిమానంతో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి చేస్తున్న అభివృద్ధి పనులు చూస్తుంటే ఆశ్చర్యపోక తప్పదు. ప్రచారానికి దూరంగా ఆయన నిడిగుంటపాళెం గ్రామాన్ని ఆదర్శగ్రామంగా మలచిన తీరు అందరి ప్రశంసలు పొందేట్లు చేస్తున్నది. స్వగ్రామాభివృద్ధికి ప్రతి ఒక్కరు నడుం బిగించాలన్న ఆలోచనను రేకెత్తిస్తుంది.

## కుటుంబ నేపథ్యం

నిడిగుంటపాళెంలో ఓ సాధారణ రైతు కుటుంబీకులు ననమాల సుందరరామిరెడ్డి, క్రిష్ణవేణమ్మ దంపతులకు పుట్టిన డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి విద్యాభ్యాసం పూర్తయ్యాక 1976 ప్రాంతంలో అమెరికాకు వెళ్లారు. న్యూయార్క్‌లోని డౌన్‌స్టేట్ మెడికల్ సెంటర్‌లో గుండె డాక్టర్‌గా శిక్షణ తీసుకొని 1981లో కాలిఫోర్నియా సమీపంలోని హెడ్జెస్టర్ ప్రాంతంలో వైద్య సేవలు ప్రారంభించారు. డాక్టర్ హస్తవాసి మంచిదని ఆనోటాఈనోటా ప్రాకడంతో 1985లో ఇదే ప్రాంతంలో డెసర్ట్‌వాలీ మెడికల్ గ్రూప్‌ను ప్రారంభించారు. కాలక్రమేణా దాన్ని ప్రైమ్ కేర్ ఇంటర్నేషనల్‌గా మార్పు చేశారు. 1994లో కాలిఫోర్నియాలోని విక్టర్ విల్లే ప్రాంతంలో 83 పడకలతో డెసర్ట్‌వాలీ ఆస్పత్రిని నిర్మించారు. ప్రేమసాగర్‌రెడ్డి స్థాపించిన ప్రైమ్ కేర్ ఇంటర్నేషనల్ సంస్థ అనతికాలంలోనే రెండున్నర లక్షల మందికి వైద్య సేవలందించడమే కాకుండా అమెరికాలో డాక్టర్ గారిని 14 సూపర్ స్పెషాలిటీ హాస్పిటళ్లకు ఛైర్మన్‌ను చేసింది.

## అవార్డులు – రివార్డులు

పాతికేళ్లకుపైగా గుండె డాక్టర్‌గా ఆయన అందించిన సేవలకు గుర్తింపుగా ఫెలో ఆఫ్ ది అమెరికన్ కాలేజి ఆఫ్ కార్డియాలజి, ఫెలో ఆఫ్ ది అమెరికన్ కాలేజి ఆఫ్ చెస్ట్ ఫిజీషియన్స్ వంటి ప్రతిష్ఠాత్మక పురస్కారాలు లభించాయి. 2008లో అమెరికాలోని మాడరన్ హెల్త్‌కేర్ మ్యాగజైన్ జరిపిన సర్వేలో డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి శక్తివంతమైన వందమంది వైద్యుల్లో ఒకరిగా గుర్తింపు పొందారు. 2008లో అదే మ్యాగజైన్ చేసిన సర్వేలో ఆయన అమెరికాలోని అత్యుత్తమ 50 మంది వైద్యులలో ఒకరిగా గుర్తింపు పొందారు.

## స్వగ్రామంలో సేవలు

అమెరికాలో ఊపిరి సలపలేనంత బిజీగా వుండే డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి జీవితంలో ఎంత ఎత్తుకు ఎదిగినా అమ్మను, పుట్టిన ఊరును మరవకూడదన్న స్ఫూర్తితో నిడిగుంటపాళెంలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలకు స్వీకారం చుట్టారు. మూడు వేల మంది గ్రామస్తులున్న ఈ గ్రామంలో మొత్తం మీద ఆరు కాలనీలున్నాయి. ముందు ఈ కాలనీ వాసులకు ప్రపంచం గూర్చి తెలియాలని కలర్ టీవీలు కొనిచ్చారు.

## విద్యాభివృద్ధిపై దృష్టి!

గ్రామంలోని స్కూల్ అభివృద్ధికి లక్షలాది రూపాయలు వెచ్చించారు. స్కూల్‌కు అనుబంధంగా సాంఘిక సంక్షేమ వసతి గృహ నిర్మాణానికి 20లక్షల రూపాయలు విరాళంగా యిచ్చారు. స్కూల్‌లో అదనపు గదుల నిర్మాణానికి మరో 20లక్షల రూపాయలు సమకూర్చారు. స్కూల్‌లో చదువుకొనే పిల్లలెవరూ కింద కూర్చొని చదువుకోకూడదన్న దృష్టితో ఆరు లక్షలు వెచ్చించి ఫర్నీచర్‌ను సమకూర్చి పెట్టారు. స్కూల్ పరిసరాల్లో శుభ్రమైన వాతావరణం నెలకొల్పే చర్యల్లో భాగంగా రోడ్డు నిర్మాణానికి 15లక్షలు ఖర్చు పెట్టారు. స్కూల్ ముందు బస్ షెల్టర్‌కు మరో ఐదు లక్షలు, ఆట స్థలం అభివృద్ధికి 10లక్షలు యిచ్చారు.

## గ్రామంలో అన్నీ సిమెంటు రోడ్లే!

గ్రామంలో మట్టి రోడ్లస్థానే సిమెంటు రోడ్లు, డ్రైనేజి కాల్వల నిర్మాణానికి రెండున్నర కోట్ల రూపాయలతో అంచనాలు రూపొందించి పనులు చేపట్టారు. ప్రస్తుతం 80శాతం మేర ఈ పనులు పూర్తయ్యాయి.

## ఇందిరమ్మ ఇళ్లకు 30లక్షలు!

గ్రామంలో మంజూరైన ఇందిరమ్మ ఇళ్లు సత్వరం పూర్తికాను ఇంటికి 10వేల రూపాయల చొప్పున 30లక్షల రూపాయలు విరాళమిచ్చారాయన.

## మంచినీటి సౌకర్యం

శుభ్రమైన మంచినీరు గ్రామస్తులు త్రాగాలన్న సంకల్పంతో ఐదు లక్షలు వెచ్చించి వాటర్ ట్రీట్‌మెంట్ ప్లాంట్‌ను కట్టించారు. గ్రామంలో రాత్రివేళల్లోనూ వెలుగులు చిమ్మను 8లక్షలు వెచ్చించి నియాన్ లైట్లు గ్రామమంతా వేయించారు.

## ముఖ్యమంత్రి సహాయనిధికి 50లక్షలు

రాష్ట్రంలో చేపట్టిన రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకం ప్రేమసాగర్‌రెడ్డికి ఎంతగానో నచ్చింది. ఈ పథకానికి చేయూతగా రాష్ట్ర ప్రభుత్వానికి 25లక్షలు విరాళంగా ఇచ్చారు. గత ఏడాది వరదలకు రాష్ట్రం అతలాకుతలమైనప్పుడు ప్రజలను ఆదుకొమ్మని మరో 25లక్షలు అప్పటి ముఖ్యమంత్రికి అందించారు. ఈ మొత్తాలేగాక హైదరాబాద్‌లోని చిల్డ్రన్ హార్ట్ ఫౌండేషన్‌కు 25లక్షల రూపాయలు విరాళమందించిన హృదయ విశాలి డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి.

## డాక్టర్‌కు చేయూత

స్వగ్రామంలో డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి చేసే అభివృద్ధి పనులను ఆయన బంధువు సుగుణాకర్‌రెడ్డి పర్యవేక్షిస్తుంటారు. ఆయనకు నెల్లూరులోని మమతా నర్సింగ్ హోమ్ అధినేత శ్రీహరిరెడ్డి కొండంత అండగా సహకరిస్తుంటారు.

అత్యున్నత పర్వతం, అతి దీర్ఘ నదీ ప్రవాహం, అతిలోతైన సముద్రం, అతిదూరపు నక్షత్రం వున్నప్పుడు.... అత్యుత్తమ మానవుడెందుకు వుండడు. దీనికి నిలువెత్తు నిదర్శనమే డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి అని నిస్సందేహంగా చెప్పొచ్చు.



నెల్లూరు మూలస్థానేశ్వర ఆలయంలో తన సొంత నిధులతో ఏర్పాటుచేసిన జనరేటర్‌ను ప్రారంభిస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి.



జిల్లాలో భారీవర్షాలపై కలెక్టరేట్‌లో సమీక్ష నిర్వహిస్తున్న కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, ఇతర అధికారులు.





హోంగార్డుల వ్యవస్థాపక దినోత్సవం సందర్భంగా జెండా వూపి ర్యాలీని ప్రారంభిస్తున్న ఎస్పీ దామోదర్.

- పులికాట్ ప్రక్కన

# పవర్ ప్రాజెక్టులా?

తీర ప్రాంత గ్రామాల్లో పవర్ ప్రాజెక్టులు నిర్మిస్తే పక్షుల మనుగడకు ప్రమాదం ఏర్పడుతుందని గూడూరు శాసనసభ్యులు బల్లి దుర్గాప్రసాద్ ఆందోళన వ్యక్తం చేశారు. వాకాడుకు విచ్చేసిన ఆయన పవర్ ప్రాజెక్టుల గురించి మాట్లాడుతూ తీరప్రాంత గ్రామాల్లో విస్తరించి వున్న పులికాట్ సరస్సుకు అతి సమీపంలో థర్మల్ ప్రాజెక్టులను నిర్మిస్తే కాలుష్యం పెరిగిపోయి పక్షులకు ముప్పు ఏర్పడుతుందన్నారు. పూడిరాయ దొరువు, పట్రంగం

## గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ ఆందోళన

వంటి గ్రామాల్లో విస్తరించి వున్న సరస్సులో విదేశీ పక్షుల సంచారం అధికంగా వుంటుందన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో కాలుష్యాన్ని వెదజల్లే పవర్ ప్రాజెక్టుల వలన వాటి ఉనికికే ముప్పు ఏర్పడుతుందని ఆందోళన వ్యక్తం చేశారు. పట్టణాలు, పల్లెలు అనే తేడా లేకుండా ప్రాజెక్టుల కారణంగా రాబోయే రోజుల్లో దయనీయమైన పరిస్థితులు ఎదురుకానున్నాయని ఆవేదన చెందారు. మండలంలోని వాలిమేడు, పామంజి గ్రామాల్లోని భూమిని ఇటీవల సెజ్‌లకు కేటాయించినందున ఆయా ప్రాంతాల్లో వివాదాలు తలెత్తకుండా పోలీసుల సహాయంతో గ్రామ సభలు నిర్వహించి భూసేకరణ జరపాలని తహశీల్దార్‌కు సూచించారు.

# కోనమల్లేశ్వరకోనను అభివృద్ధి చేయరా?

## బ్రహ్మాండమైన పర్యాటక క్షేత్రం

వెంకటగిరి నియోజకవర్గంలోని శైవక్షేత్రాలు అభివృద్ధికి నోచుకోవడం లేదు. ఈ ప్రాంతంలో పలు ఆలయాలు వున్నప్పటికీ వాటికి సరైన రోడ్డు మార్గం, వసతి సౌకర్యాలు లేకపోవడంతో చుట్టు ప్రక్కల ప్రాంతాల నుంచి వచ్చే భక్తులు అష్టకష్టాలు పడి దైవ దర్శనం చేసుకోవాల్సి వస్తోంది. వెంకటగిరి సమీపంలోని వెలిగొండ అడవుల్లో కోనమల్లేశ్వర కోన వుంది. ప్రకృతి అందాలు, సహజసిద్ధమైన జలపాతాల నడుమ వున్న శివ లింగం భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది. అక్కడకు వెళ్లేందుకు సరైన రోడ్డు మార్గం లేకపోవడంతో భక్తులు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. డక్కిలి మండలంలోని వెలిగొండ అడవుల్లోనే వున్న స్తంభాలేశ్వర కోనకు సరైన మార్గం లేదు. రాపూరు మండలంలో చిట్వేలి ఘాట్ రోడ్డు నుంచి మూడు కి.మీ దూరంలో వున్న శివబుగ్గ క్షేత్రంకు వెళ్లాలన్నా ఇబ్బందులు పడాల్సిందే. దీనినే సిద్ధలయ్యకోనగా పిలుస్తారు. సైదాపురంలోనూ సిద్ధలయ్య ఆలయం వుంది. సాధారణ రోజుల కంటే కార్తీకమాసంలో భక్తులు ఈ క్షేత్రాలకు రావడం అధికంగా వుంటుంది. కానీ ప్రభుత్వం, పాలకులు ఈ శైవ క్షేత్రాలను అభివృద్ధి చేయకపోవడంతో భక్తులు తీవ్ర అసౌకర్యాల నడుమ దర్శించాల్సి వస్తోంది. భక్తుల రద్దీ, క్షేత్ర మహత్యాన్ని దృష్టిలో వుంచుకొని ఈ ప్రాంతాలను అభివృద్ధి చేయాలని, రోడ్డు తదితర సౌకర్యాలు కల్పించాలని నియోజకవర్గ ప్రజలు కోరుకొంటున్నారు.

# నష్టాల్లో నెల్లూరు ఆర్టీసి

- లాభాల్లో వున్న సంస్థకు ఈ దుర్గతెందుకు దాపురించింది.

జిల్లాలో ఆర్‌టిసి నష్టాల బాట పట్టింది. గత ఏడాది అక్టోబర్ నుంచి ఈ ఏడాది అక్టోబర్ వరకు 2.87 కోట్ల నష్టం వాటిల్లింది. జిల్లాలో మొత్తం పది డిపోలలో ఏడు డిపోలు నష్టాల్లో వున్నట్లు ఆర్‌టిసి ఆర్‌ఎం కొమరయ్య తెలిపారు. జిల్లాలో ఆర్‌టిసికి తీవ్ర నష్టం వాటిల్లిందన్నారు. సూళ్లూరుపేట డిపోను ఆకస్మిక తనిఖీ చేసిన ఆయన నష్టాల పరిస్థితిని వివరించారు. నెల్లూరు రెండో డిపో అత్యధికంగా 1.68కోట్ల నష్టంలో నడుస్తున్నాదన్నారు. గూడూరు డిపో కోటీ 39లక్షలు, సూళ్లూరుపేట డిపో 35.52లక్షలు వున్నాయన్నారు. నెల్లూరు ఒకటవ డిపో, కావలి, ఉదయగిరి డిపోలు కొంతమేర ఆదాయాల్లో వున్నా గత ఏడాది కంటే ఈ ఏడాది గణనీయంగా 94లక్షలు తగ్గిపోయిందన్నారు. నష్టాల్లో వున్న ఆర్‌టిసిని లాభాల బాట పట్టించేందుకు ప్రయత్నాలు చేస్తున్నామన్నారు. జిల్లాకు క్రొత్తగా 77 బస్సులు కావాలని ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపామని త్వరలో ఇవి జిల్లాకు వస్తాయన్నారు. టిటిడి అధికారులతో చర్చించి తిరుమలకు వెళ్లే ప్రయాణీకులకు ప్రత్యేక ప్యాకేజీలతో సర్వీసులను నడిపేందుకు ప్రయత్నిస్తున్నట్లు వివరించారు.

# ఆత్మకూరు మార్కెట్ కమిటీ ఛైర్మన్ ఎవరు?

## రసకందాయంగా ఎన్నిక

ఆత్మకూరు మార్కెట్ కమిటి నియామకం రసకందాయంలో పడింది. ఆ జిల్లాలో వివిధ కమిటీలతోపాటు మార్కెట్ కమిటి పాలకమండలి నియామకం జరగాల్సి వుంది. పదవుల కోసం నాయకుల మధ్య పోటీ ఏర్పడడం, ఎవరికి వారు ప్రయత్నాలు చేస్తుండడంతో స్థానిక రాజకీయం అంతా మార్కెట్ కమిటీ చుట్టూ పరిభ్రమిస్తోంది. ప్రస్తుతం ఛైర్మన్‌గా అల్లారెడ్డి కృష్ణారెడ్డి కుటుంబీకులు కొనసాగుతున్నారు. ఇందుపూరు వెంకటరమణారెడ్డి మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నుంచి హామీ పొంది వున్నాడు. ఈ పరిస్థితుల్లో పాలకమండలి భర్తీపై ఆనం మీన మేషాలు లెక్కిస్తుండడంతో అలిగిన రమణారెడ్డి మంత్రికి దూరంగా మెలగుతున్నాడు. మార్కెట్ కమిటి ఛైర్మన్ కోసం షుమారు 10 మంది వరకు పోటీపడుతున్నట్లు సమాచారం. ఎవరిని ఈ పదవి వరించనుందో చూడాలి.

- అంగన్‌వాడీల్లో

# చెడిన పౌష్టికాహారం!

అంగన్ వాడీ కేంద్రాల్లో అందించే పౌష్టికాహారం తిని పిల్లలు అస్వస్థతకు గురైన సంఘటన ముత్తుకూరు మండలంలో చోటు చేసుకొంది. మండలంలోని ముసునూరువారి పాళెంలోగల అంగన్‌వాడీ కేంద్రంలో 20 మంది పిల్లలకు పౌష్టికాహారాన్ని అందించారు. దీనిని తిన్న వంశీ, జగదీష్, సుమతి అస్వస్థతకు గురయ్యారు. ఆస్పత్రికి తరలించి చికిత్స చేయించి మెరుగైన

## అస్వస్థతతో అల్లాడిన పిల్లలు

చికిత్స కోసం నెల్లూరుకు తరలించారు. సకాలంలో వైద్య సహాయం అందడంతో అస్వస్థతకు గురైన పిల్లలు కోలుకున్నారు. పౌష్టికాహారం నాసిరకంగా వుండడమే దీనికి కారణం అని పిల్లల తల్లిదండ్రులు ఆరోపిస్తున్నారు. అంగన్ వాడీ కేంద్రాల్లో పౌష్టికాహారం సంగతి అటుంచితే పరమ నాసిరకంగా ఆహారాన్ని, నిల్వ చేసిన దానిని పిల్లలకు పెడుతుండడంపై పలు విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

# బ్లాక్‌మార్కెట్‌కు ఎరువులు

## పడుగుపాడు సొసైటీ వ్యాపారం బాగుంది

కంచె చేను మేసిన చందంగా వుంది పడుగుపాడు వ్యవసాయ పరపతి సంఘం నిర్వాకం. రైతులకు విక్రయించాల్సిన రసాయనిక ఎరువుల్ని సంఘం నిర్వాహకులు బ్లాక్ మార్కెట్‌కు తరలించి వేస్తుండడం కలకలం రేపింది. నియోజకవర్గ కేంద్రమైన కోవూరుతోపాటు పడుగుపాడు, పాటూరు, గంగవరం, పోతిరెడ్డిపాళెం, లేగుంటపాడు, ఇనమడుగు గ్రామాల రైతులకు మాత్రమే వ్యవసాయ పరపతి సంఘం ఎరువులను విక్రయించాలి. కొందరు సొసైటీ సిబ్బంది అక్రమాలకు పాల్పడుతూ వీటిని ప్రైవేట్ వ్యాపారులకు అమ్మేస్తున్నారు. ఇక్కడ నుంచి ట్రాక్టర్లలో బయటి వ్యాపారులకు ఎరువుల బస్తాలను తరలించి సిబ్బంది డబ్బులు దిగమింగుతున్నారట. దీంతో రైతులకు అవసరమైన ఎరువులు దొరకడం లేదు. ప్రభుత్వం అందించే ఈ ఎరువులనే ప్రైవేట్ వ్యక్తుల వద్ద నుంచి అధిక ధరకు కొనుగోలు చేయాల్సి వస్తోందని స్థానిక రైతులు వాపోతున్నారు. సంబంధిత అధికారులు ఈ అక్రమాలకు అడ్డుకట్టవేసి ఆయా గ్రామాల రైతులకు ఎరువులు లభించేలా చూడాల్సి వుంది.

## ఆందోళనలో రైతులు

### వరినాట్లు ఆలస్యం

జిల్లాలో వరిసాగు ఆలస్యమయ్యింది. రబీ సీజన్‌లో సాగు చేయాల్సి వున్న చాలాచోట్ల నార్లుపోసే పరిస్థితి కన్పించడం లేదు. సోమశిల జలాశయంలో సమృద్ధిగా నీరున్నా రెండో పంట పండించలేమన్న ఆందోళన రైతుల్లో వ్యక్తమవుతోంది. ఇటీవల కురిసిన వర్షాలే ఈ పరిస్థితికి కారణమని రైతులు వాపోతున్నారు. జూన్ మొదటి వారం నుంచే వర్షాలు ప్రారంభం కావడం రైతులకు శాపంగా పరిణమించింది. ఆ కాలంలో మొదటి పంట వెన్ను, పొట్ట, చిరు కంకుల దశల్లో వుండడం, వర్షాలు పడుతుండడంతో ఖరీఫ్ సీజన్ ఆలస్యమైంది. ఇదే ఆలస్యం కొనసాగి రబీ సీజన్‌ను మరింత ఆలస్యం చేసింది. తెగుళ్లు రైతులకు దడ పుట్టిస్తున్నాయి. వ్యవసాయ శాస్త్రవేత్తలు సైతం స్వల్పకాలిక పంటలను సాగు చేసుకోమని సూచిస్తున్న తరుణంలో రైతులు ఆందోళన చెందుతున్నారు. దీనికి తోడు విత్తనాల సమస్య రైతులను పట్టి పీడిస్తోంది. రైతులకు సరిపడా విత్తనాలను తీసుకోరావడంలో వ్యవసాయశాఖ పూర్తిగా విఫలమైంది. ఈ పరిస్థితుల్లో రైతుల్లో పంటల సాగుపై తీవ్ర నిరాశ ఏర్పడుతోంది.

# పాఠశాలకు రాజకీయ గ్రహణం!

### నారాయణరెడ్డిపేటలో పరిస్థితిది

నారాయణరెడ్డి పేటలో నిర్మితమవుతున్న పాఠశాలకు రాజకీయ గ్రహణం పట్టింది. విద్యార్థులకు సౌకర్యంగా వుంటుందన్న ఉద్దేశ్యంతో ప్రభుత్వం గదులను నిర్మించేందుకు అనుమతి ఇస్తే గ్రామంలో నెలకొన్న రాజకీయ వర్గపోరు ఆ నిర్మాణాలు నిలిచిపోయేందుకు కారణం అయ్యింది. రూరల్ మండల పరిధిలోని నారాయణరెడ్డిపేటలో వున్న పాఠశాల విద్యార్థుల సంఖ్యకు చాలినంతగా గదులు లేకపోవడంతో పిల్లలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. దీనిని గుర్తించిన రాజీవ్ విద్యామిషన్ పాఠశాల నిర్మాణానికి అనుమతినిచ్చి ఏడాది క్రిందట నిధులు మంజూరు చేసింది. గ్రామంలో అధికారంలో వున్న వర్గానికి, వారి ప్రత్యర్థి గ్రూపుకు పాఠశాల నిర్మాణం విషయమై వివాదం తలెత్తింది. తమ కారణంగానే పాఠశాల నిర్మితమవుతుందని ఎవరికివారు చెప్పుకోవడంతో ఇరువర్గాల మధ్య తలెత్తిన వివాదం చివరకు పాఠశాల నిర్మాణ పనులు నిలిచిపోయేందుకు కారణం అయ్యాయి. కొన్ని గదులు సగంలో ఆగిపోగా, మరికొన్ని పునాదులకే పరిమితం అయ్యాయి. అధికారులు ఇరువర్గాల మధ్య రాజీ కుదిర్చి నిర్మాణం పూర్తి చేసేందుకు ప్రయత్నించినా అది కుదరకపోవడంతో విద్యార్థులు నలిగిపోతున్నారు. ఇప్పటికైనా జిల్లా అధికారులు జోక్యం చేసుకొని పాఠశాలను నిర్మించి విద్యార్థులకు ఇబ్బందులు తొలగించాలని పలువురు తల్లిదండ్రులు కోరుకొంటున్నారు.

## కూలిపోయేందుకు సిద్ధంగా రైల్వేక్వార్టర్లు

### బిట్రగుంటలో ఇదీ పరిస్థితి

బిట్రగుంటలో గల రైల్వేక్వార్టర్స్ శిథిలావస్థకు చేరుకున్నాయి. రైల్వే ఉద్యోగులు, సిబ్బంది కోసం వీటిని నిర్మించారు. వీటి నిర్మాణం జరిగి దశాబ్దాలు గడచిపోవడంతో ఈ గృహాలు కూలిపోయేందుకు సిద్ధంగా వున్నాయి. ఎప్పుడు కూలిపోతాయోనన్న భయంతో వీటిలో నివాసం వుండే వారు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని జీవించాల్సి వస్తోంది. దీనికి తోడు ఈ క్వార్టర్స్ చీకటి కార్యకలాపాలకు నిలయంగా మారుతున్నాయి. పలువురు నేరస్తులు ఇక్కడ స్థావరాలు ఏర్పాటు చేసుకొని పేకాట, మద్యం సేవించడం, వ్యభిచారగృహాలుగా మార్చివేశారు. బహిరంగంగా శిథిలమైన క్వార్టర్స్‌లో అసాంఘిక కార్యకలాపాలు సాగుతున్నా వారిపై ఫిర్యాదు చేయడానికి ఇక్కడ నివసించే కుటుంబాల వారు హడలి పోతున్నారు. ఇప్పటికైనా రైల్వే అధికారులు మరమ్మత్తులు చేయించడంతోపాటు బయట వ్యక్తుల చొరబాటును అడ్డుకోవాల్సి వుంది.

## స్మశానాన్ని ఆక్రమించారు!

### బోగోలులో బరితెగించిన దురాక్రమణదారులు

బోగోలు పంచాయితీ పరిధిలోని స్మశాన స్థలాన్ని కొందరు ఆక్రమించివేశారు. గ్రామంలోని చెరువు దగ్గర 2 ఎకరాల స్మశాన స్థలం వుంది. కబ్జాదారులు తమ భూదాహాన్ని తీర్చుకొనేందుకు ఈ స్థలంపై కన్నేశారు. అనుకుందే తడవుగా స్థలాన్ని ఆక్రమించిపారేశారు. ఉపాధిహామీ పనులతో దారిని వేసుకొన్నారట. ఇంత జరుగుతున్నా పంచాయితీ అధికారులుగానీ, పాలకులు గానీ స్మశాన స్థలాన్ని కబ్జాకోరల నుంచి కాపాడేందుకు చర్యలు తీసుకోకపోవడం విమర్శలపాలవుతోంది. దీనిపై పలుమార్లు అధికారుల చుట్టు తిరిగినా ఉపయోగం లేకుండా పోయిందని గ్రామస్తులు వాపోతున్నారు. ఇప్పటికైనా అధికారులు నిద్రమేల్కొని స్మశాన స్థలాన్ని కబ్జాల చెర నుంచి విముక్తి చేయాల్సి వుంది.

## నిర్లక్ష్యంతోనే రైలు ప్రమాదాలు

### కుంభకర్ణనిద్రలో టిఎక్స్‌ఆర్ విభాగం

రైల్వే అధికారుల నిర్లక్ష్యంతో తరచూ రైళ్లు ప్రమాదాలకు గురౌతున్నాయి. టిఎక్స్‌ఆర్ డిపార్టుమెంటు సక్రమంగా రైళ్లు తనిఖీ చేయకపోవడంతో ప్రయాణీకులు ప్రమాదాలకు గురికావాల్సి వస్తోంది. రైలు కంపార్టుమెంట్లలో అగ్నిప్రమాదం చోటు చేసుకోవడం ఈ నిర్లక్ష్యాన్ని తెలియజేస్తుంది. కృష్ణ ఎక్స్‌ప్రెస్, పద్మావతి, నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్, తిరుమల, సింహాద్రి, పినాకిని ఎక్స్‌ప్రెస్‌లలో మంటలు చెలరేగడంతో ప్రయాణీకులు తీవ్ర ఆందోళన చెందారు. సాధారణంగా కంపార్టుమెంట్, చక్రాలు, బేరింగ్, బ్రేకులు చెక్ చేసి డ్రైవర్, గార్డుకు అన్ని సక్రమంగా వున్నట్లు సర్టిఫికేట్ ఇవ్వాలి. తర్వాత టిఎక్స్‌ఆర్ అధికారి విజయవాడకు సమాచారం అందించి రైలు కదలడానికి గ్రీన్ సిగ్నల్ ఇస్తాడు. ఇంత తతంగం వున్నా రైళ్లలో అగ్ని ప్రమాదాలు, ఇతరత్రా సమస్యలకు కారణం అధికారుల నిర్లక్ష్యమేనని తెలుస్తోంది. క్షుణ్ణంగా తనిఖీ చేసే ఓపిక లేక అధికారులు పైపైన చెక్ చేసి వదలిపెడ్తుండడం తరచూ రైలు ప్రమాదాలకు కారణంగా భావించాల్సి వస్తోంది.

## సీనియర్లు 'చే'జారుతారా?



రాష్ట్రంలో సీనియర్ కాంగ్రెస్ నాయకులు త్వరలోనే ఆ పార్టీకి గుడ్ బై చెప్పనున్నారా! రాజధానిలో ప్రస్తుతం దీనిపైనే చర్చజరుగుతోంది. కిరణ్‌కుమార్‌రెడ్డి సిఎం అయ్యాక సీనియర్లకు ప్రాధాన్యత లేకుండా పోయిందన్నది వారి వాదన. రాష్ట్రంలో మెజారిటీ ఓటర్లు వున్న కమ్మ, కాపు కులస్తుల నుంచి ఈ రకమైన నిరసన వ్యక్తమవుతోంది. గుంటూరు జిల్లాలో కాంగ్రెస్ పార్టీలో సీనియర్లు అయిన రాయపాటి సోదరులు తమ నిరసనను బహిరంగంగానే వ్యక్తం చేశారు. రాయపాటి శ్రీనివాస్‌కు మంత్రి పదవి ఇవ్వకుండా తమ ప్రత్యర్థి కన్నా లక్ష్మీనారాయణను తిరిగి మంత్రిగా చేయడాన్ని ఎంపీ రాయపాటి సాంబశివరావు అవమానంగా భావిస్తున్నాడు. త్వరలోనే తాము తట్టాబుట్ట సర్దుకొని బయటికి వెళ్తామంటూ బహిరంగంగానే ప్రకటించాడు కూడా. దాసరి నారాయణరావు కూడా కాంగ్రెస్‌కు గుడ్‌బై చెప్పే మూడ్‌లో వున్నాడట. తనను ఎవరూ లెక్క చేయడం లేదని, అటువంటప్పుడు పార్టీలో కొనసాగడం ఎందుకంటూ సన్నిహితులతో చెబుతున్నాడు. కాగా జగన్ వర్గం ఇప్పటికే అసంతృప్తుల వద్దకు రాయబేరాలు ప్రారంభించింది. చూద్దాం... భవిష్యత్తులో ఏంజరుగుతుందో!!

## రాయల ఉత్సవాలకు పైసల్లేవు!



ప్రభుత్వం ఆర్భాటంగా ప్రారంభించిన శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేక పంచశతాబ్ది ఉత్సవాలు నిధుల్లేక వెలవెలబోతున్నాయి. రాష్ట్రపతి చేతుల మీదుగా ప్రారంభమైన ఈ ఉత్సవాల్ని సాంస్కృతికశాఖ నిర్వహిస్తోంది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఈ ఉత్సవాల కోసం యాభైలక్షల రూపాయలు ఇచ్చారు. రాష్ట్రప్రభుత్వం మరో రెండు కోట్ల రూపాయల్ని విడుదల చేస్తానంది. అయితే ఇంతవరకు ఒక్క పైసా కూడా విదల్చలేదు. దీంతో ఉత్సవాలు మూలపడ్డాయి. ఇప్పటికే నిర్వహించిన కార్యక్రమాల్లో పాల్గొన్న కళాకారులకు ఇస్తానన్న డబ్బు ఇవ్వలేదు. డబ్బుల కోసం కళాకారులు రోజూ సాంస్కృతికశాఖ కార్యాలయం చుట్టూ కాళ్లరిగేలా తిరుగుతున్నారు. శ్రీకృష్ణ దేవరాయల పేరుతో ప్రారంభమైన ఉత్సవాలు ఇలా నిధుల్లేక ఉసూరంటూ డీలాపడటం పట్ల సాంస్కృతిక అభిమానులు కళ్లెర్రచేస్తున్నారు.

## ఆ మంత్రులకు 'మాజీ'లే ముద్దట!



రాష్ట్రంలో మాజీ అధికారులకు స్వస్తి చెబుతున్నామంటూ కిరణ్ కుమార్ ప్రకటించి వారం రోజులు కూడా గడవక ముందే సాక్షాత్తు ఆయన మంత్రివర్గ సహచరులే సిఎంకు 'షాక్' యిచ్చారు. తమ వ్యక్తిగత సహాయకులుగా ఫలానా రిటైర్డ్ అధికారిని నియమించాలంటూ డజను మంది మంత్రులు సిఎంకు లేఖలు వ్రాశారు. కనీసం తన మాటకు విలువ కూడా ఇవ్వకుండా ఇలా రిటైర్డ్ అధికారుల కోసం మంత్రులు అడగటాన్ని కిరణ్‌కుమార్ జీర్ణించుకోలేక పోతున్నాడట. అయితే రాష్ట్రం ప్రధాన కార్యదర్శి మాత్రం మంత్రుల అభీష్టానుసారమే రిటైర్డ్ అధికారుల నియామక ప్రతిపాదనల్ని ఆర్థికశాఖ అనుమతి కోసం పంపాడు. ఆ తర్వాత ఫైలు సిఎం దగ్గరకు వస్తుంది. అప్పుడు సిఎం తీసుకునే నిర్ణయంపైనే రిటైర్డ్ అధికారుల భవిష్యత్తు ఆధారపడి వుంది.

అయితే వాళ్లు లేకుండా తాము శాఖల్ని నిర్వహించలేమంటున్నారు మంత్రులు. ఒక వేళ సిఎం గనక వ్యతిరేకిస్తే గట్టిగానే ఎదుర్కోవాలని మంత్రులు నిర్ణయించుకున్నారట. అంటే సిఎం, మంత్రుల మధ్య 'రగడ'కు మాజీలు మరో కారణం కాబోతున్నట్లే కదా!

## బొత్సకు రెండూ కావాలట!



సీనియర్ అయిన బొత్స సత్యనారాయణకు సిఎం రవాణా శాఖను కేటాయించాడు. సిఎం కావాల్సిన తను జూనియర్ కిరణ్‌కుమార్ రెడ్డి మంత్రివర్గంలో అనామక శాఖను నిర్వహించాల్సి వస్తున్నందుకు బొత్స అవమానంగా భావిస్తున్నాడట. తన సామాజిక వర్గం వారికి 'కీలక' శాఖలు ఇవ్వకుండా సిఎం కులస్తులకే పెద్దశాఖల్ని కట్టబెట్టడాన్ని బొత్స జీర్ణించుకోలేకపోతున్నాడు. శాఖను మార్చడంతోపాటు పిసిసి అధ్యక్ష పదవిని కూడా తనకివ్వాలంటూ బొత్స అధిష్టానం పెద్దల్ని కోరుతున్నాడట. గతంలో డి.శ్రీనివాస్ కూడా రాష్ట్రమంత్రిగా వుంటూ పిసిసి అధ్యక్షుడిగా పని చేశారని ఆయన గుర్తుచేస్తున్నాడట. రాష్ట్రంలో సిఎం సామాజిక వర్గం కంటే తమ కులస్తులే అధికంగా వున్నందున తనకు ప్రాధాన్యం కల్పించడం పార్టీకి మంచిదంటూ బొత్స సన్నాయి నొక్కులు నొక్కుతున్నాడు.

## ఆయన స్టైలే వేరు!




రాష్ట్ర ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ వ్యవహారశైలి సచివాలయంలో హాట్‌టాపిక్‌గా మారింది. అటు మంత్రులు, ఎమ్మెల్యేలతోనే కాకుండా ఇటు అధికారగణంతో కూడా కిరణ్ సన్నిహితంగా వుండలేకపోతున్నారు. సందర్శకులు ఎవరొచ్చినా కనీసం కూర్చోమనడం లేదట. వైఎస్ సిఎంగా వున్నప్పుడు పరిస్థితి దీనికి భిన్నంగా వుండేదని, పని చేసినా చేయకపోయినా ఆయన ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడని సందర్శకులు గుర్తు చేసుకుంటున్నారు. కొత్త ముఖ్యమంత్రికి పలుకే బంగారంగా మారిందన్నది వారి ఆరోపణ. ఇదే విషయాన్ని సీనియర్ ఎమ్మెల్యేలు సైతం చెవులు కొరుక్కొంటున్నారు. సిఎం ఇలా రిజర్వ్‌డ్‌గా వుంటే పరిపాలన ముందుకు సాగటం కష్టమన్నది వారి భావన. వింటున్నారా! సిఎం గారూ...





ఆనం విజయకుమార్‌రెడ్డి ఏకైక కుమారుడు ఆనం కార్తికేయరెడ్డి రాష్ట్రమంత్రి డికె.అరుణ కుమార్తె స్నిగ్ధల వివాహం నవంబర్ 25తేది హైదరాబాద్‌లో జరిగింది.



# అమరవీరుల త్యాగాలకు గుర్తుగా మొహరం

ప్రజాస్వామ్య పరిరక్షణకు తమ ప్రాణాలను అర్పించిన వీరులను స్మరించుకొంటూ పదిరోజులపాటు పాటించే విషాద దినాలే మొహరం. ఇస్లాం మతంలో ప్రజాస్వామ్యం, లౌకిక భావం పట్ల అనాదిగా ధృఢ విశ్వాసం వుంది. ప్రజల్లోని మూఢనమ్మకాలను పారద్రోలడం ప్రధాన లక్ష్యంగా భావించే ఇస్లాం, రాక్షసత్వాన్ని రూపుమాపి మానవత్వానికి జీవం పోయడానికి ప్రాణాలైనా తెగించాలనే ఉన్నతమైన ఆశయానికి తార్కాణంగా నిలిచేదే మొహరం. ఈ పేరు చెప్పగానే ముస్లింలతోపాటు ప్రతి ఒక్కరికి ఇమామ్ హుస్సేన్, ఇమామ్ హసన్‌లు స్మరణకు వస్తారు. మొహరం మాసం ఆరంభం కాగానే ఇస్లాం నూతన సంవత్సరం ప్రారంభం అవుతుంది. మొహరం అనగానే రాచరికానికి ఎదురుతిరిగి ప్రజాస్వామ్య పరిరక్షణకుగాను శత్రుసేనలతో వీరోచితంగా పోరాడి ప్రాణ త్యాగం చేసిన విషాద ఘటనలు గుర్తుకు వస్తాయి.

క్రీస్తు శకం 632 సంవత్సరంలో మహమ్మద్ ప్రవక్త పరమపదించిన అనంతరం అరేబియా దేశంలో ప్రజాస్వామ్య రీతిలో ప్రతినిధులను (ఖలీఫాలు) ఎన్నుకొన్నారు. హజ్రత్ అబ్రూబక్ సిద్ధిఖీ, హజ్రత్ ఉమర్, హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీలు ఖలీఫాలుగా ఎన్నికైనారు. వారి పాలనలో ప్రజాస్వామ్యం పరిడవిల్లింది. ఆ తర్వాత కాలంలో ప్రజాస్వామ్యానికి సంకెళ్లు పడ్డాయి. పాలకుల స్వార్థం, రాక్షసత్వం కలగలసి దుర్మార్గపాలన సాగింది. సిరియా గవర్నర్ మారియా అధికార దాహంతో దుష్టుడు, నీచుడైన దియాజిద్‌ను పాలకునిగా నియమించదలచి ఆనాడు పాలకునిగా వున్న మహమ్మద్ ప్రవక్త మనుమలైన ఇమామ్ హసన్‌ను పదవీ భ్రష్టుడ్ని చేసేందుకు కుటిలయత్నాలు చేస్తాడు. ప్రజల కోసం పదవిని తృణప్రాయంగా తలచి పదవీ త్యాగం చేస్తాడు. ఆ తర్వాత కాలంలో విషప్రయోగం కారణంగా మరణిస్తాడు. అరాచకపాలనకు వ్యతిరేకంగా హుస్సేన్ పోరాటం ప్రారంభిస్తాడు. ఇస్లాం ధర్మశాస్త్రాన్ని అనుసరించి సంప్రదింపులే సమస్యకు విమోచన మార్గమని బలంగా నమ్మే హుస్సేన్ చర్చల కోసం రాజధాని కుఫాకు తన అనుచరులు 72మందితో కలసి బయలుదేరుతాడు. కర్బలా ప్రాంతానికి చేరుకొనేసరికి క్రూరుడైన యాజిద్, హుస్సేన్‌ను అంతం చేయదలచి పోరుకు సిద్ధమవుతాడు. ఇరువర్గాల మధ్య భీకరపోరు సాగుతుండగా ఒక శుక్రవారం నాడు శత్రువునడిగి కొంత విరామం తీసుకొని నమాజుకు సిద్ధపడుతారు. శత్రువుల వెన్నుపోటుతో హుస్సేన్ తదితరులను అంతమొందిస్తారు. మానవత్వం మంటగలసిన ఆ దారుణ సంఘటన స్మృత్యర్థం మొహరం పది రోజులపాటు విషాద దినాలుగా పాటిస్తారు.

మొహరం అనగానే అమాయకుల రక్తంతో ఎర్రబారిన కర్బలా మైదానం గుర్తుకు వస్తుంది. దుష్ట సాంప్రదాయాలను మట్టుబెట్టి ధర్మ సంస్థాపన కోసం ప్రాణాలర్పించిన అమర వీరులను ఆనాడు స్మరించుకొంటారు. వేదనాభరిత హృదయాలతో శరీరంపై పదునైన ఆయుధంతో గాయాలు పెట్టుకోవడం సాంప్రదాయంగా వుంది. J

## ట్రంకురోడ్డు



### సిఎం పలుచన - మంత్రి లావున!



శరీరాలను బట్టి చూస్తే ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ఆర్థికమంత్రి రామనారాయణ రెడ్డి కన్నా సన్నగానే వుంటారు. ఇదేతీరులో నెల్లూరులో వెలిసిన రామనారాయణరెడ్డి స్వాగత ఫ్లెక్సీలలోనూ ఆయన్ను పలచన చేశారు. నెల్లూరు కనక మహల్ సెంటర్‌లో ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డికి స్వాగతం పలుకుతూ పెట్టిన ఫ్లెక్సీలో ముఖ్యమంత్రిని మునగ కాడలా మంత్రిని ఆజానుబాహునిగా చిత్రించారు. నామ్‌కే వాస్తేగా ముఖ్యమంత్రి బొమ్మ పెట్టాలని పెట్టి సిఎంను పలుచన చేశారని ఆయన అభిమానులు నొచ్చుకొంటున్నారు.

### తీరుమారని ఆనం!



ఆలస్యం... అమృతం విషమన్నారు పెద్దలు. కానీ ఈ ర్యోక్తి అసలు తలకెక్కినట్లు లేదు మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి. ఫలానా సమయానికి రామనారాయణ రెడ్డి ఆ కార్యక్రమానికి హాజరవుతారంటే కనీసం దానికి ఒకటిన్నర గంట నుంచి రెండు గంటలపాటు లేటుగా వస్తారాయన. ఆర్థికమంత్రి అయ్యాక శ్రీశైలం నుంచి బయలుదేరిన రామనారాయణరెడ్డి 4తేది సాయంత్రం ఆరు గంటలకు నెల్లూరు వస్తారని ప్రకటించగా ఆయన రాత్రి తొమ్మిదింటికి వచ్చారు. ఐదో తేది ఎనిమిది గంటలకు పెన్నావారధిని సందర్శిస్తారంటే పదిగంటలకు ఆ ప్రాంతానికి వచ్చారాయన. ఆ తర్వాత ఇందిరాభవన్‌లో పదిగంటలకు విలేకరుల సమావేశానికి సమాచారశాఖాధికారులు సందేశమివ్వగా 11.30కు తీరిగ్గా వచ్చారాయన. ఆ తర్వాత కావలిలో జరిగిన సైన్సు ఫేర్‌కు ఆలస్యంగా వెళ్లారు. 6తేది అంబేద్కర్ వర్థంతి పురస్కరించుకొని విఆర్‌సి సెంటర్‌లోని ఆయన విగ్రహానికి ఉదయం 8.30 ప్రాంతంలో పూలమాలలు వేసి నివాళులర్పిస్తారని ముందు ప్రకటించగా లేటుగా పదిగంటలకు వచ్చారు. చివరికి ఈ మధ్య ఆయన భక్తిశ్రద్ధలతో కొలుస్తున్న శివదర్శనానికి సైతం ఆలస్యంగా వెళ్లిన విషయం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.



### బొకే వ్యాపారులకు పండగ

నెల్లూరులో బొకేల వ్యాపారం అంతం మాత్రంగానే జరుగుతుంది. కాని 5తేది అమావాస్య... ఆదివారమైనా వందల సంఖ్యలో బొకేలు అమ్ముడుకావడంతో ఆ వ్యాపారుల ఆనందానికి అవధులు లేవు. ఆర్థిక మంత్రి ఆదివారం నెల్లూరులో వుండడం, ఆరోజే వారింట పెళ్లి రిసెప్షన్ జరగడంతో వారికి శుభాకాంక్షలు చెప్పాలనుకొన్న ప్రతిఒక్కరు బొకేలపై పడ్డారు. కార్తీకమాసం చివరిరోజు పూలకు విపరీతమైన డిమాండ్ వుండడంతో యాభై, వంద రూపాయలకు అమ్మే బొకేను నిలబెట్టి మూడు వందల రూపాయలకు అమ్మి పండగ చేసుకొన్నారు.

### ఆయనింకా కార్పొరేటరట

అదేదో సినిమాలో పాటను గుర్తు చేసేలా ఫ్లెక్సులు వేయించుకొన్నాడు మాజీ కార్పొరేటర్ పిండి సురేష్. కార్పొరేషన్‌లో సీనియర్ కార్పొరేటర్ అయిన ఈయనకు ఫత్తేఖాన్ పేటలో 'కులం' బలముంది. దీనివల్ల ఆనం బ్రదర్స్‌తోనే తిరుగుతుంటాడాయన. ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డికి స్వాగతం పలుకుతూ ఫత్తేఖాన్‌పేట సెంటర్‌లో కట్టించిన ఫెక్సీలో 35వ డివిజన్ కార్పొరేటర్ అని పెట్టుకోవడం చూసి స్థానికులు విస్తుపోయారు. మాజీ అయ్యి మూడునెలలైనా కార్పొరేటర్ అనే ఐదక్షరాల హోదాను మాత్రం ఆయన వీడడం లేదన్న గుసగుసలు వినిపించాయి.

### గడగడలాడించిన చలి



సహజంగా డిసెంబరు నెల చివరి వారంలో నెల్లూరీయులకు చలి తగులుతుంది. కాని బంగాళాఖాతంలో వాయుగుండం మూలంగా 6తేది ఒక్కసారిగా వాతావరణం మారిపోయింది. రోజంతా వర్షం... దీనికి తోడు చలి ఒక్కసారిగా విజృంభించడంతో జనం వణికిపోయారు. ముసలీ ముతక, పిల్లా జల్లాతో పాటు యువకులను సైతం చలి గడగడలాడించింది. మారుతున్న వాతావరణ పరిస్థితుల్లో ఎండా, వానే కాదు చలికి కూడా అందరూ తలవంచక తప్పదని నిరూపించింది.




ఈ కాలమంతా పరీక్షా కాలంగా ఉంటుంది. అనుకొన్నవి అనుకొన్నట్టుగా జరుగవు. మనస్సు అశాంతికి, ఆందోళనకు గురౌతుంది. అనవసర విషయాల్లో జోక్యం చేసుకోవడం మంచిది కాదు. నూతన వ్యక్తులతో పరిచయం మొదట లాభించినా తరువాత నష్టాలకు గురిచేస్తుంది. సంతాన విషయంలో కొద్దిపాటి జాగ్రత్త వహించండి. ఆర్థికంగా ఇబ్బంది లేకపోయినా భయాందోళనలుంటాయి.




పరిస్థితులను, సందర్భాన్ని అనుసరించి మెలిగితే మంచిది. దీర్ఘకాలిక అనారోగ్యంతో బాధపడేవారు మరింత జాగ్రత్తగా వుండాలి. ఉద్యోగులకు స్థానమార్పులు అనివార్యం. ఆర్థికపరంగా కొంత ఇబ్బంది ఉంటుంది. వ్యవహారపరంగా అనుకూల కాలం. అన్ని పనులు త్వరితగతిన ముందుకు సాగుతాయి. కుటుంబపరమైన చికాకులు ఏకాగ్రతను దెబ్బతీస్తాయి.




సంఘంలో గౌరవమర్యాదలు పొందే విధంగా ప్రవర్తిస్తారు. ఆరోగ్య రీత్యా ఆందోళన ఉంటుంది. బంధుమిత్రుల రాకతో ఇంట సందడి నెలకొంటుంది. ప్రణాళికాబద్ధంగా జరగాల్సిన పనులు ముందుకు సాగక ఇబ్బందిపెడతాయి. అర్థరహితమైన ఖర్చులతో సతమతమౌతూ అప్పుల కోసం ప్రయత్నాలు సాగిస్తారు. శుభ కార్య నిర్వహణకు చేసే ప్రయత్నాలు కొంతవరకు సఫలీకృతమౌతాయి.




పరిస్థితులు గతవారం కంటే మెరుగ్గా ఉంటాయి. మీ శ్రమకు తగ్గ ఫలితం లభిస్తుంది. ముఖ్య వ్యవహారాల్లో సమయస్ఫూర్తితో వ్యవహరించండి. ఉష్ణ సంబంధ వస్తువుల విషయంలో జాగ్రత్తగా వుండండి. వృత్తి, వ్యాపారాలు ఒక మోస్తరుగా నడుస్తాయి. విద్యార్థులు అధికశ్రమతో మాత్రమే విజయం పొందగలరు. ఉద్యోగులకు పై అధికారుల నుండి ఒత్తిడి అధికంగా ఉంటుంది.




వారం మొదట్లో అన్ని అనుకొన్నట్లుగానే సాగుతాయి. పోను పోను ఇబ్బందులు ఎదురౌతాయి. బంధుమిత్రులతో వ్యవహరించేటప్పుడు మాట తొందర వద్దు. అనవసర ప్రసంగం అసలే వద్దు. అన్ని విషయాల్లోను ఓపిగ్గా ఆలోచించి వ్యవహరించడం మంచిది. వృత్తి, విద్యల వారికి అనుకూలం. ముఖ్యమైన కోర్టు వ్యవహారాలు ఈ వారం ఒక కొలిక్కి వస్తాయి.




ఈ వారమంతా మీకు అనుకూల సమయం. మనసున తలచిన పనులన్నీ సజావుగా ముందుకు సాగి విజయవంతంగా ముగుస్తాయి. బంధుమిత్రుల మొహమాటంతో మీకు ఇష్టంలేని పనులు చేయాల్సి వస్తుంది. వృథా కాలయాపన చేస్తారు. కుటుంబంలోని పెద్దల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. ఏ విషయంలోనైనా సరే మధ్యవర్తిత్వం వహించడం, హామీలుండడం పొరబాటున కూడా చేయకండి.

# వారఫలాలు

*తేది 11-12-2010 నుండి 18-12-2010 వరకు వృశ్చిక, ధనుస్సులో రవి; తులలో శుక్రుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో కుజ, బుధ, రాహువులు; మిథునంలో కేతువు; మకర, కుంభ, మీన, మేషాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

11తేది సుబ్రహ్మణ్య షష్ఠి.
15తేది పొట్టి శ్రీరాములు వర్థంతి.
17తేది ముక్కోటి ఏకాదశి.

### శుభ ముహూర్తాలు

15తేది మకరలగ్నాన ఉ.9.00 నుండి 10.00 గంటల వరకు, కర్కాటకలగ్నాన రా.8.00 నుండి 9.00 వరకు.

16తేది కర్కాటక లగ్నాన రా.8.00 నుండి 9.00 గంటల వరకు, సింహలగ్నాన రా.10.00 నుండి 11.00 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### డిసెంబర్ తిథులు

**మార్గశిర శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 11 | శని | షష్ఠి | తె.3.41 | గం.ల.వ |
| 12 | ఆది | సప్తమి | తె.6.10 | గం.ల.వ |
| 13 | సోమ | అష్టమి | పూర్తిగా | |
| 14 | మంగళ | అష్టమి | ఉ.8.42 | గం.ల.వ |
| 15 | బుధ | నవమి | ఉ.11.02 | గం.ల.వ |
| 16 | గురు | దశమి | మ.1.00 | గం.ల.వ |
| 17 | శుక్ర | ఏకాదశి | మ.2.24 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




బంధువుల రాక తృప్తినిస్తుంది. పైత్యప్రకోపం. అధిక ఖర్చులు మనసును కుంగతీస్తాయి. వ్యాపారులు నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు కొంత మేలు. సరైన ఆలోచనలు మేలు చేస్తాయి. విద్యార్థులు కాలం వృథా గానిస్తారు.




అనవసర విషయాల కోసం డబ్బును అంతకన్నా విలువైన సమయాన్ని వృథాగా ఖర్చు చేసే సూచనలున్నాయి. అసంబద్ధమైన వాదాలతో ఇతరులను చికాకు పరుస్తారు. కొన్ని వ్యవహారాల్లో నిరుత్సాహం, నిరాశాజనక వాతావరణం వుంటుంది. మీపై పైచేయి సాధించాలని చూసేవారికి అవకాశాలు లభిస్తాయి. వ్యాపార విషయంలో మాత్రం అన్ని విధాల అనుకూలం. విద్యార్థులకు శుభ సమయం.




అకారణ కలహాలు తలెత్తే ప్రమాదముంది. కాబట్టి ఇరుగు, పొరుగు వారితో ఆచి తూచి మాట్లాడితే మంచిది. మీ గౌరవానికి భంగం కలిగించే సూచనలున్నాయి. ముఖ్యమైన వ్యవహారాల్లో తొందరపాటు కారణంగా నష్టపోయే సూచనలున్నాయి. ఆరోగ్యం విషయంలో మెలకువగా ఉండాలి. అధిక ప్రయాణాలు సూచితమౌతున్నాయి. వ్యాపార విషయంలో మాత్రం అన్ని విధాల అనుకూలం.




కొన్ని సందర్భాల్లో అధిక ప్రసంగం వల్ల చిక్కుల్లో పడే ప్రమాదముంది. ఉద్యోగులకు పని భారం, పై అధికారుల ఒత్తిళ్ళు అధికంగా ఉంటాయి. ఆర్థికంగా ఈ వారం వెనుకంజగానే వుంటుంది. శుభకార్య మూలక ధన వ్యయం. కుటుంబములో కొందరి ప్రవర్తన వల్ల మనస్సు వికలమౌతుంది. కొన్ని సందర్భాల్లో మంచికి పోతే చెడు ఎదురవుతుంది. ఆరోగ్య విషయంలో ఆందోళన చెందుతారు.




కొద్దిపాటి అడ్డంకులు ఎదురైనా తలచిన కార్యక్రమాలు పూర్తవుతాయి. ఆర్థికంగా పరిపుష్టి కలిగి ఉన్నా మనసులో ఆందోళన, భయం వెన్నాడుతూ ఉంటాయి. తనకుమాలిన ధర్మం పనికి రాదని గ్రహించండి. ఉద్యోగులు విధి నిర్వహణలో అలసత్వం వల్ల ప్రమాదంలో పడే సూచనలున్నాయి. వృత్తి, వ్యాపారాలు లాభాల బాటన పయనిస్తాయి. బంధుమిత్రుల నుండి మాటసాయం అందుతుంది.




లాభనష్టాలు, కష్టసుఖాలు సమపాళ్ళలో ఉంటాయి. వారమంతా మిశ్రమ ఫలితాలు. వ్యాపారులకు లాభం చక్కగావున్నా ఖర్చులధికం. ఉద్యోగులు పై అధికారుల మన్ననలు పొందలేరు. వ్యాపార భాగస్వాములతో చక్కని సమన్వయం కలిగి ఉంటారు. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. ఉద్యోగులకు పదోన్నతి, తద్వారా స్థాన చలనం. కోర్టు వ్యవహారాల్లో తాత్కాలిక ఉపశమనం లభిస్తుంది.

# వాయువ్యంలో గోశాలతో ఇంట ధనలక్ష్మి తిష్ట!

*సి.హెచ్.హనుమంతరెడ్డి — సూళ్లూరుపేట*

** పశుశాలల ప్రభావం గృహస్థులపై ఉంటుందా?*

పశ్చిమ నైరుతి ఆయుధశాల, పశ్చిమ, దక్షిణాలలో బరువులు, వాయువ్యంలో గోశాల వుంటే రైతు ఇంట 'ధనలక్ష్మి' నివాసం వుంటుందంటారు.

*షేక్ పర్వీన్‌బీబీ — నెల్లూరు*

** ఆయన చెప్పినమాట పూర్తిగా వినడం మానేశాడు.వేరేఆమెతో సంబంధం కూడా వుంది.*

మీరు పగడం(ప్రథమార్థ) కుడి సూర్యాంగుళీయానికి ధరించండి. 'శీతల యంత్రం' ప్రతిష్ట కొంత పరిస్థితిని తగ్గిస్తుంది. కుటుంబ పెద్దలతో ఒకసారి కౌన్సిలింగ్ చేయించండి.

*జాన్సన్ సుధాకర్ — నెల్లూరు*

** అమ్మ ఆరోగ్య పరిస్థితి మెరుగు పడటం లేదు. ఆమె లేకుండా నేను జీవించలేను.*

దక్షిణ ఆగ్నేయంలోని సెప్టిక్‌ట్యాంకు ఉత్తర ఈశాన్యం స్నానపు గదిని మార్చండి. ఆమె కుడి చిటికెన వ్రేలికి గోమేధుకం ధరింపజేయండి. అమ్మపై మీకున్న భక్తి దివ్యౌషధమై ఆమెను కాపాడుతుంది.

*నాజర్ మహమ్మద్ — నెల్లూరు*

** పచ్చ ధరించాక చాలా చిడిముడిగా వుంటే భయపడి తీసివేశాను.*

జన్మ తేదీ సమయాన్ని బట్టి మీకు పగడం, ముత్యం వస్తాయి. ఎవరో చెప్పారని ఏదో ధరించకూడదు. నవరత్న ఉంగరం ఎవరైనా సరే అస్సలు ధరించకూడదు.

*పరిమి తిరుపతిరెడ్డి — కర్నూలు*

** మూలలు తిరిగిన స్థలాల్ని సరిచేసుకోవచ్చా?*

అలాంటివి కొనకపోవడమే మంచిది. స్థలం వృధా కావడమేగాకుండా, చుట్టుప్రక్కల 'కోణవేధ' మీ గృహానికి తగులుతాయి.

*కురుంజి హైమావతి — చెన్నై*

** ఈశాన్యంలో మంత్ర కుంభ స్థాపనను గురించి మీరొకసారి రాశారు.*

అనార్థికం, అనారోగ్యం, వైవాహిక సంబంధాలున్న గృహాలకు 'మంత్ర కుంభ' స్థాపన చాలా మేలు చేస్తుంది. అయితే విధిగా పూజా గృహంలో 'రక్ష' ప్రతిష్టించుకోవాలి.

*ధరణిదేవుల రామయ్య — చెన్నై*

** అపార్టుమెంటు దోషాల్ని ఎలా గణిస్తారు. పరిష్కారం చెప్పండి?*

బాహిరంతర దోషాలున్నప్పుడు అంతర దోషాల్ని సరిచేసుకోవడం, బాహిర్దోషాలకు యంత్ర ప్రతిష్టలు చేస్తారు. మీరు నైరుతి గదిలోని బాత్ టబ్‌ని తూర్పు బాత్‌రూంలోకి మార్చుకోక తప్పదు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.రమణదీక్షితులు — చెన్నై*

** గోమేధుకం ధరించాక ఆశ్చర్యకరంగా అతని అనారోగ్యం మాయమయింది.*

గోమేధుకం ధరించాక వ్యాధి నయమవుతుందనే నిర్ధారణకు అతను వచ్చాడు. నమ్మకం దివ్యౌషధమని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

*కె.వి.శైలజారాణి — ఒంగోలు*

** వేల కిలోమీటర్ల దూరంలోని గ్రహాల ప్రభావం భూమిపై ఎలా వుంటుంది?*

అమావాస్య, పౌర్ణమి రోజుల్లో చంద్రుడి ఆకర్షణ శక్తి పెరిగి సముద్రమే(3 భాగాలు) అల్లకల్లోలమయినపుడు ఒకటిలో నాలుగో భాగమున్న భూమి ఆకర్షణకు గురికాకుండా ఎలా వుండగలుగుతుంది.

*ఎ.శ్రీమన్నారాయణ — గుంటూరు*

** పశ్చిమ గృహంలో నైరుతి నడక మంచిది కాదు. నిజమేనా?*

వాయువ్యం సింహద్వారం, నైరుతి బెడ్‌రూం ఉండాలి. అలా లేవు గనుక దోషయుక్తం.

*బి.వి.రాణి — గుంటూరు*

** ఆమె ఆగడాల్ని అతను పట్టించుకోడు. ఆత్మహత్య చేసుకుందామనుకుంటున్నాను.*

జాతకరీత్యా మీకెలాంటి గృహ పీడనలు లేవు. అత్త పిచ్చి మాటలు నమ్మవద్దని మీవారికి చెప్పండి. అతన్ని నన్ను ఫోనులో సంప్రదించమని చెప్పండి. మీరు నవగ్రహాలు తిరగవలసిన అవసరం కూడా లేదు.

# ప్రజాపథం వినతులకు పరిష్కారం దొరికేనా?

**కొత్త ముఖ్యమంత్రి ఖజానాలో వున్న నిధులతోనే ప్రజల ఇబ్బందుల్ని తీర్చాలని ఆదేశించడంతో ప్రజాపథం కార్యక్రమంలో అందిన అర్జీల కట్టలను వివిధ శాఖాధికారులు బయటకు తీస్తున్నారు.**



*ప్రజల నుంచి విజ్ఞప్తులు స్వీకరిస్తున్న కలెక్టర్ రాంగోపాల్.*

జిల్లావ్యాప్తంగా గత నాలుగు విడతలుగా జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో గ్రామీణ ప్రాంత సమస్యలపై లెక్కలేనన్ని వినతి పత్రాలు అందాయి. దివంగత ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి హయాంలో ప్రజాపథం కార్యక్రమానికి శ్రీకారం చుట్టి ప్రజల సమస్యలను పరిష్కరించాలని సంకల్పించారు. ఆయన మరణానంతరం కూడా ప్రజాపథం కార్యక్రమం నిర్వహించినా సమస్యలు మరింత పేరుకుపోయాయే తప్ప ఒక్కటీ పరిష్కారానికి నోచుకోలేదు. ఈ కార్యక్రమం ద్వారా గ్రామాలకు వెళ్లిన అధికారులకు ఆయా గ్రామాల్లోని ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు ఇతరసదుపాయాలు కల్పించాలని విన్నవించుకున్నారు.

అయితే ప్రస్తుతం అధికార మార్పిడి జరగడంతో ప్రజాపథం కార్యక్రమంలో సమర్పించిన వినతులపై అధికారులు స్పందిస్తారా? లేదా? అని ప్రజల్లో చర్చ జరుగుతుంది. నూతన ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన కిరణ్‌కుమార్‌రెడ్డి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రవేశపెట్టిన పథకాలన్నీ కొనసాగిస్తానని స్పష్టం చేయడంతో జిల్లా అధికారులు బూజు పట్టిన ఫైళ్లను బయటకు తీస్తున్నారు. వున్న నిధులతోనే ప్రజల ఇబ్బందుల్ని తీర్చాలని అధికారులను ఆదేశించడంతో సంబంధిత శాఖల అధికారులు కసరత్తు చేయడం ప్రారంభించారు. జిల్లాలో నాలుగు విడతలుగా నిర్వహించిన ప్రజాపథం కార్యక్రమంలో శాఖలవారీగా స్వీకరించిన వినతి పత్రాలను క్రోడీకరిస్తున్నారు.

గ్రామీణ ప్రాంతాల్లో త్రాగునీటి సమస్య, ఇందిరమ్మ గృహాలు, పావలావడ్డీ, పారిశుద్ధ్యం, ఇందిర బీమా యోజన, రాజీవ్ బీమా యోజన, పశుక్రాంతి పథకం, అభయహస్తం, పెన్షన్ల పంపిణీ, చౌకదుకాణాల నిర్వహణ, జలయజ్ఞం తదితర పథకాలు సక్రమంగా అమలు కావడం లేదు. పై సమస్యలపై ప్రతి గ్రామంలోని ప్రజలు అధికారులకు మొరపెట్టుకొని పరిష్కరించాలని విజ్ఞప్తి చేశారు. గతంలో గ్రామాలకు వెళ్లి సమస్యల పరిష్కారం కోసం కృషి చేస్తామని హామీ ఇచ్చిన అధికారులు ఆ తర్వాత పత్తా లేకుండా పోయారు. సంవత్సరాలు గడిచినా అధికారులు పట్టించుకోకపోవడంతో ప్రజాపథం కార్యక్రమం అంటేనే ప్రజలు అసహనం వ్యక్తం చేసే పరిస్థితి ఏర్పడింది.

ఒక మంచి లక్ష్యంతో శ్రీకారం చుట్టిన ఈ కార్యక్రమం పట్ల ఎమ్మెల్యేలు, ఎమ్పీలతోపాటు స్థానిక సంస్థల ప్రజాప్రతినిధులు సైతం పెద్దగా ఆసక్తి చూపలేక పోయారు. ఏదైనా కార్యక్రమంలో పాల్గొనేందుకు గ్రామాలకు వెళ్లిన అధికారులు, ప్రజాప్రతినిధులను సమస్యలపై ప్రజలు నిలదీసి ప్రశ్నిస్తున్నారు. దీంతో గ్రామీణ ప్రాంతాలకు వెళ్లడం చాలా వరకు తగ్గించుకోవాల్సి వచ్చింది. ప్రజలు చెబుతున్న సమస్యలు పరిష్కరించాలంటే నిధుల కొరత వుందని అధికారులు సమాధానం చెబుతూ వస్తున్నారు.

శాఖలవారీగా జిల్లాకు కేటాయించిన నిధులు, ఖర్చు చేసిన నిధుల వివరాలను పంపాలని ప్రభుత్వం ఆదేశించింది. ఇప్పటివరకు చలనం లేకుండా వున్న అధికారులు ప్రభుత్వం మారడంతో విధి నిర్వహణపై దృష్టిసారించారు. ఇటీవల జిల్లా కలెక్టర్ అన్ని శాఖలకు చెందిన అధికారులకు ప్రజల సమస్యలపై ఎప్పటికప్పుడు స్పందించాలని కోరడం ఇందుకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు. ఏది ఏమైనా ప్రజాపథం కార్యక్రమంలో స్వీకరించిన వినతిపత్రాలపై ఎటువంటి స్పందన లభిస్తుందో వేచి చూడాలి.

అవినీతిబాట

## • గాడి తప్పిన

# మునిసిపల్ ఆడిటింగ్ విభాగం!

**నెల్లూరు కార్పొరేషన్‌లో ఆడిటింగ్ విభాగాన్ని పర్యవేక్షించే అధికారి కార్యాలయానికి బదులు ఇంటి నుంచి కార్యకలాపాలు నిర్వహిస్తూ మహా బాగా కమీషన్లు పొందుతున్నాడు.**

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయంలోని ఆడిటింగ్ విభాగం గాడి తప్పిపోయింది. కార్పొరేషన్ పరిధిలో చేపట్టే వివిధ రకాల పనులకు సంబంధించి జరిగే నగదు చెల్లింపులపై ఎప్పటికప్పుడు ఆడిటింగ్ చేయాలన్న వుద్దేశంతో ఆడిటింగ్ విభాగాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. నగదు చెల్లించే సమయంలో ఇందుకు సంబంధించిన ఫైళ్లను సమగ్రంగా పరిశీలన చేసిన తర్వాతనే నగదు చెల్లింపుకు ఆమోదముద్ర వేయాల్సి వుంటుంది. కొన్ని నెలలపాటు ఈ విధానం సక్రమంగా జరిపించిన అధికారులు ఆ తర్వాత పరిశీలన చేయడం మానేశారు.

ఆడిటింగ్ విభాగం అధికారులు బిల్లులను పరిశీలన చేయడం వల్ల అక్రమాలు జరగకుండా నిలిచిపోతాయి. రాజకీయ ఒత్తిళ్ల కారణంగానో లేకుంటే ఉన్నతాధికారుల ఒత్తిళ్ల మేరకో తెలియదు కాని మొత్తం మీద ఎటువంటి పరిశీలన చేయకుండానే నగదు చెల్లింపులకు అనుమతి ఇస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి. ఇలా చేయడం వలన అక్రమాలకు మరింతగా ఆస్కారం ఏర్పడే అవకాశం వుంది. మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయంలోని వివిధ విభాగాలకు చెందిన అధిపతులు తమ విభాగాల పరిధిలో అత్యవసరమైన పనులను చేస్తుంటారు. ఇందుకు ముందుగా అడ్వాన్స్ చెల్లిస్తారు. చెల్లించిన అడ్వాన్స్‌కు బిల్లులు, రశీదులను సమర్పించాల్సి వుంటుంది.

ఇక్కడ అధికారులు చేతివాటం బాగానే ప్రదర్శిస్తుంటారు. తక్కువ పనులు చేసి ఎక్కువ చేసినట్లు చూపించడంలో ఆరితేరారు.

### ఇంటి నుంచే కార్యకలాపాలు

ఆడిటింగ్ విభాగాన్ని పర్యవేక్షించే అధికారి కార్యాలయంకు బదులు ఇంటి నుంచే అన్ని కార్యకలాపాలను కొనసాగిస్తున్నారు. మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయంలో రోజులో ఉదయం రెండుగంటలు, సాయంత్రం ఒక గంట మాత్రమే దర్శనమిస్తుంటారు. మిగిలిన సమయంలో ఇంట్లోనే వుంటారు. కార్యాలయంలోని సహాయకుని ద్వారా ఫైళ్లను ఆయన నివాసానికి తెప్పించుకొని తూతూ మంత్రంగా పరిశీలన చేసి సంతకం చేస్తుంటారన్న ప్రచారం జరుగుతుంది.

ఆడిటింగ్ అధికారి అధికార కార్యకలాపాల నిర్వహణ కోసం అద్దె వాహనాన్ని కూడా సమకూర్చారు. ఈ వాహనంలో ఈయనకు బదులు కుటుంబ సభ్యులు నగరంలో పర్యటిస్తుంటారు. ఈ విషయం కమిషనర్ దృష్టికి వెళ్లినా కూడా చూసీచూడనట్లుగా వెళ్తున్నారు. తన దగ్గరకు వచ్చిన బిల్లులపై సంతకం చేయాలంటే రెండు శాతం కమీషన్ అడుగుతాడని సిబ్బంది చర్చించుకుంటున్నారు. అడిగినంత కమీషన్ సమర్పించకుంటే ఏదో ఒక కారణం చూపి బిల్లులను వెనక్కు పంపుతాడన్న విమర్శలు వున్నాయి. ప్రధానంగా ఇంజినీరింగ్ విభాగం, హెల్త్ సెక్షన్‌ల నుంచి వచ్చే బిల్లులు సక్రమంగా వుండవు. కమీషన్ ఇస్తుండడంతో ఆమోద ముద్ర వేసేస్తుంటారు. మునిసిపల్ కార్పొరేషన్‌లో అక్రమాలను నియంత్రించాలన్న లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఆడిటింగ్ విభాగం కూడా గాడితప్పింది. ప్రజలు చెల్లిస్తున్న పన్నులతోపాటు రాష్ట్రప్రభుత్వం నుంచి గ్రాంట్ల రూపంలో కోట్ల రూపాయల నిధులు విడుదలవుతున్నాయి. ఈ నిధుల్ని అవసరం లేకపోయినా పనులకు కేటాయిస్తూ దుర్వినియోగం చేస్తున్నారు. ఉన్నతాధికారులు స్పందించి ఆడిటింగ్ విభాగం సక్రమంగా పనిచేసే విధంగా చర్యలు చేపట్టాల్సిన అవసరం ఏర్పడింది.





# రొమాంటిక్ పాత్రలిష్టం!

బాలీవుడ్ హీరోయిన్ దీపికా పదుకొనె టివీల్లో ప్రసారమయ్యే 'కాఫీ విత్ కరణ్' కార్యక్రమంలో హీరో రణబీర్ కపూర్‌పై చేసిన వాఖ్యలు సంచలనం సృష్టించాయి. దీనికి కారణం ఇటీవల ఈమె హీరో ఇమ్రాన్ ఖాన్‌తో కలసి తిరగడమంటున్నారు. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను ఈ మధ్య మీ పాత్రల్లో శృంగారం దట్టిస్తున్నారే అంటే నేను ఇష్టపడే పాత్రలవి. రొమాన్స్‌తో కూడిన కథలంటే ఇష్టం. దానికితోడు ఇప్పుడన్నీ ఇలాంటి పాత్రలు, కథలే వస్తున్నాయి. యూత్‌ను ఆకట్టుకోవాలంటే ఇవి పోషించక తప్పడం లేదు. అలాగని కేవలం ఆ తరహా పాత్రలకే పరిమితం కాను. అప్పుడప్పుడు వినోదం, యాక్షన్ సన్నివేశాలు కలిగిన చిత్రాలు కూడా చేస్తాను. ప్రస్తుతం కెరీర్ పైనే దృష్టి పెట్టాను. అమూల్యమైన సమయాన్ని ప్రేమ పేరుతో చెడగొట్టుకోనంది.

# ఛాలెంజింగ్ పాత్రలు చేస్తా!



వయసుకు తగిన పాత్రలు ఎంచుకోవడంలోనే నటీనటుల ప్రతిభ బయటపడుతుంది. ముందుచూపుతో వ్యవహరించే వాళ్ళు వయస్సు పైబడిన పాత్రలు చేయడానికి అసలు ఒప్పుకోరు. కానీ హీరోయిన్ జెనీలియా దీనికి విరుద్ధం. నాకు వయసు పట్టింపు లేదు. నిజానికి వయసు మీద పడ్డ పాత్రల్లో నటించడం ఓ సవాల్. ఇరవై ఏళ్ల వయసున్నప్పుడు కాలేజి అమ్మాయిగా కనిపించడంలో గొప్పేముంది? అదే వయసులో అరవైఏళ్ల ముసలమ్మ పాత్ర చేయడంలోనే మన సత్తా బయట పడుతుంది. హిందీలో ప్రియాంకా చోప్రా చేస్తున్నది అదే కదా. అంత గొప్ప అందగత్తె చేసినప్పుడు లేనిది మిగతావాళ్లకు వచ్చే ఇబ్బంది ఏమిటో అర్థం కావడం లేదంది జెనీలియా.

# నెంబర్‌వన్ కాను!

తమిళ చిత్రరంగంలో నెంబర్‌వన్ తమన్నానే... అంటూ అక్కడి పత్రికలు తమన్నాను ఆకాశానికి ఎత్తేస్తున్నాయి. నిజానికి తమిళ రంగంలో తమన్నాకు ఆ స్థాయిలో విజయాలేం దక్కలేదు. తమిళ 'ఆవారా' బాగా ఆడిందంతే. ఈ చిత్రం తర్వాత తమన్నాకు అక్కడ అవకాశాలు జోరందుకొన్నాయి. అక్కడ హవా తట్టుకోవడానికి కొన్ని తెలుగు సినిమాలు కూడా వదలుకొంది. నాగచైతన్య, ఎన్టీఆర్‌తో నటిస్తున్న తెలుగు సినిమాలు మినహా మిగతా సమయం తమిళ రంగానికే కేటాయిస్తోంది. సమయాభావం వల్ల కాల్షీట్లు సర్దుబాటు చేయలేకపోతున్నానంటుంది ఈ సుందరి. తమిళంలో నువ్వే నెంబర్ వన్ అంటూ చాలామంది అంటున్నారు. అదంతా వాళ్ల అభిమానం. నాకన్నా గొప్ప కథానాయికలు తమిళ చిత్రసీమలో వున్నారు. వాళ్ల ముందు నేనెంత? ఇంకా నేర్చుకోవాల్సింది, సాధించవలసింది ఎంతో వుందంది తమన్నా.



# వసపిట్టలా నిత్యమీనన్

పలు మళయాళ, కన్నడ, తమిళ చిత్రాల్లో హీరోయిన్‌గా నటించిన నిత్యమీనన్ తెలుగులో అలామొదలైంది, 180 సినిమాల్లో నటిస్తుంది. ఈ హీరోయిన్ మాటల ధోరణి కాస్త విచిత్రంగా వుంది. నేను నటిస్తాను అంతే. సినిమాలు చూడను. నాకు సినిమాలంటే ఇష్టం లేదు. నేను కొన్ని కన్నడ, మళయాళ, తమిళ చిత్రాలు చేశాను. కాకపోతే అవన్నీ ఆర్ట్ సినిమాల తరహాలో కొనసాగుతాయి. నాకేమో కళాత్మక భావాలుంటూ వ్యాపార విలువలు జోడించిన సినిమాల్లో నటించాలని వుంది. తెలుగు సినిమాలన్నీ వాణిజ్య ప్రధానమైన చిత్రాలే. నాయికలకు అంతగా నటించే అవకాశం వుండదు. డిగ్రీ చదివాను. జర్నలిజంలో డిప్లొమా కూడా చేశాను. సినిమాటోగ్రాఫర్ కావాలనుకొన్నాను. కానీ ఇలా కెమెరా ముందే ఉండిపోవాల్సి వస్తోందని వస పిట్టలా మాట్లాడేసింది.



# మగాళ్లతో అలసిపోయాను



చంద్రముఖి తర్వాత నయనతార నటించిన చిత్రాలన్నీ హిట్ కావడంతో గోల్డెన్‌లెగ్ ముద్రపడి ఆమెకు స్టార్‌డమ్ వచ్చింది. అయితే నయన కెరీర్‌ను సీరియస్‌గా తీసుకోకుండా ప్రేమలు, దోమలు అంటూ తిరగడం మొదలుపెట్టింది. ఈ వ్యవహారాలు తనను మీడియాలో నలిగేట్లు చేస్తాయని తలపోసినా చివరికి అవి శింబు రూపంలో బెడిసి కొట్టాయి. నానా బాధలు పడి శింబును వదిలించుకొని సుఖంగా వుండక మళ్లీ రెండో పెళ్లి చేసుకుంటున్నట్లు, పెళ్లయిన ప్రభుదేవాతో జత కట్టింది. మీడియాలో ఈ విషయమై పలు వార్తలు రావడం, ప్రభుదేవా భార్య కోర్టుకు వెళ్లడంతో మేం పెళ్లి చేసుకోవడం లేదని ప్రకటించింది. ఇవేం మాటలంటే మగాళ్లతో అలసిపోయి విసిగిపోయానంటుంది. ఇక నుంచి తన దృష్టాంతా కెరీర్‌పైనే అంటుంది. నమ్ముదామా?



# ఓ మోస్తరుగా ఆలస్యం.. అమృతం!

✍ అల్లూరు రహీం

సురేష్ ప్రొడక్షన్ ప్రైవేట్ లిమిటెడ్ పతాకంపై డి.రామానాయుడు తీసిన 135వ చిత్రం ఆలస్యం అమృతం. ఆత్మహత్య కూడదని, మనిషిగా పుట్టడం వరమని; సమస్యలు వచ్చిపోయే మబ్బులనే పాయింట్ ఆధారంగా రెండు గంటల పాటు సాగుతుందీ చిత్రం. ఈ చిత్రానికి సురేష్ ప్రొడక్షన్స్ పతాకంపై గతంలో 'ప్రేయసిరావె'ను తీసిన చంద్రమహేష్ దర్శకుడు. ఈ సినిమా మొత్తం రైల్వేస్టేషన్‌లో జరుగుతుంది. ఇక్కడే హీరో, హీరోయిన్ల పరిచయం, కథ తాలూకు మిగతా పాత్రలు పాసింజర్ల రూపంలో, స్టేషన్‌లో వివిధ వ్యక్తుల రూపంలో తారసపడతాయి. వీటిలో కొన్ని పాత్రలు గిలిగింతలు పెట్టగా మరికొన్ని చిత్రం సాగతీతకు సహకరిస్తాయి. రైల్వే స్టేషన్‌లో యాచకుని పాత్ర ప్రతి ఒక్కరికీ ఎప్పుడోఒకప్పుడు తారసపడే వుంటుంది. అధ్వాన్నంగా టీ, కాఫీ అమ్మే వెండర్ పాత్రలో గౌతంరాజు అలరించకపోయినా, దొంగగా తిరిగే ఆలీ మాత్రం ప్రేక్షకుల అభిమానం దోస్తాడు. స్టేషన్‌మాస్టర్‌గా ఎంఎస్.నారాయణ తన పంచ్ మాటలతో, జాతకాలు చెప్పే పురోహితునిగా ఎవిఎస్ జనాన్ని ఆకట్టుకొంటారు. కామెడీ కోసమే సృష్టించిన రైల్వే ఎస్ఐ పాత్రలో రఘుబాబు వికారంగా వున్నాడు. క్రిస్టియన్ ఫాదర్ పాత్రలో ధర్మవరపు సుబ్రహ్మణ్యం కామెడీ కన్నా ఓ మతస్తుల మనస్సు గాయపరచినట్లు కనపడతాడు. ఇస్కాన్ స్వామిగా అశోక్‌కుమార్, ఫ్యాక్షనిస్టుగా తనకు మంచినీళ్ల ప్రాయమైన పాత్రలో జయప్రకాష్‌రెడ్డి అలరిస్తారు. పృధ్వీరాజ్ వ్రాసిన ఈ సినిమా కథకు దర్శకుడు చంద్రమహేష్ కూర్చిన స్ర్కీన్‌ప్లే ఆద్యంతం వినోదాత్మకంగా సాగలేదనే చెప్పాలి. కోటి సమకూర్చిన సంగీతంలో ఏడవకే... ఏడవకే చంటిపాపాయి, కౌష నర్తించిన ఐటమ్ పాట ధగధగ రంగుల లోకం బాగున్నాయి. ఏం పిల్ల సరదాగా పాటను రంగీలా సినిమాలో పాటకు మక్కీకిమక్కీ కాపీ చేశాడాయన. ఈ మధ్య అంతగా కనపడని పరుచూరి బ్రదర్స్ ఈ చిత్రానికి మాటలు వ్రాసారు. తప్పులు దిద్దుకొనేవాడు గొప్పవాడు, ఫస్ట్ లవ్ బెస్ట్ లవ్, ప్రేమ ఆశ్చర్యంలో నుంచి పుడుతుంది. వీరి మాటల్లో ఎన్నతగినవి. చిత్రంలో కామెడీ బాగా పేలకపోవడానికి పరుచూరి బ్రదర్సే కారణమనక చెప్పక తప్పదు. కెమెరామెన్ పూర్ణ విశాఖపట్నంలోని రామానాయుడు స్టూడియోలోని అందాలతోపాటు అరకులోయను వెండితెరపై కొట్టొచ్చేటట్లు కనపడేలా చేశాడు.

ఇక చిత్ర కథలోనికి వెళ్తే అమెరికాలో వుద్యోగం రావడంతో అన్నవరం సత్యనారాయణస్వామిని దర్శించను వస్తాడు రామ్ (నిఖిల్). తిరుగు ప్రయాణంలో స్టేషన్‌లో వుండగా వైదేహి (మదాలస శర్మ) తాను చనిపోవాలనుకొంటున్నట్లు వ్రాసిన ఉత్తరం గాలికి వచ్చి రామ్‌ను చేరుతుంది. ఇదే ఉత్తరం ఇంతకు మునుపు స్టేషన్‌లో వుండే ఇస్కాన్ స్వామి (అశోక్‌కుమార్) కూడా చదువుతాడు. అక్కడ నుంచి ఆ అమ్మాయిని తెలుసుకొనే ప్రయత్నంలో రామ్ వుండగా ఓ అనాథ బిడ్డ వీరిద్దరినీ ఒకరినొకరు పరిచయం చేసుకొనేలా చేస్తాడు. ఆ బిడ్డను వారిద్దరు స్టేషన్‌లోని రైల్వే పోలీసులకు అప్పగించపోగా వాళ్లు అక్కడ పారేసి పొమ్మంటారు. వైదేహి బ్యాగ్‌లోని డబ్బు చూసి స్టేషన్‌లోని దొంగ (అలీ) ఆమెను వెంబడిస్తుంటాడు. స్టేషన్‌మాస్టర్ (ఎం.ఎస్.నారాయణ)ను ప్రయాణీకులకు ఏ సమాచారాన్ని సరిగ్గా ఇవ్వడు. అన్నింటికి వెటకారంగా మాట్లాడుతాడు. తన భార్యకు విడాకులివ్వకూడదని తలచిన ఫాదర్ (ధర్మవరపు సుబ్రహ్మణ్యం) తోపాటు ఫ్యాక్షనిస్ట్ (జయప్రకాష్) సింహాద్రి ఎక్స్‌ప్రెస్ లేటుగా రావడాన్ని సహించలేక అసహనాన్ని వ్యక్తం చేస్తుంటారు. ఎట్టకేలకు రామ్ ఉత్తరం వ్రాసింది వైదేహి అని తెలుసుకొంటాడు. ఆమె తన తల్లితండ్రులు చేయతలపెట్టిన వివాహం ఇష్టంలేక విజయవాడ వెళ్లి కనకదుర్గమ్మను దర్శించి ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకొన్నట్లు చెబుతుంది. సింహాద్రి ఎక్స్‌ప్రెస్ లేటయ్యే రెండు గంటల్లో స్టేషన్‌లో పలు నాటకీయ సంఘటనలు చోటుచేసుకొంటాయి. అంతిమంగా వైదేహి, శ్రీరామ్‌కు ఐలవ్‌యూ చెబుతుంది. స్టేషన్‌లో తనను కలిసేలా చేసిన అనాథ బాలుడ్ని పెంచుకొందామని ఆ జంట నిర్ణయించుకోవడంతో కథ ముగుస్తుంది. హ్యాపీడేస్ చిత్రంలో చిన్నపాత్రలో కనపడే నిఖిల్‌కు సురేష్ ప్రొడక్షన్స్‌లో హీరోగా నటించే ఛాన్స్ ప్రమోషనే. దీన్ని అతను చక్కగానే ఉపయోగించుకొన్నాడు. హీరోయిన్ మదాలస గ్లామర్‌గా లేకపోయినా నటనలో ప్రేక్షకుల అభిమానం పొందుతుంది. ఆలస్యం అమృతం సురేష్ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో వచ్చిన పలు చిత్రాల మాదిరి హాఫ్ బీట్ చిత్రమేనని చెప్పక తప్పదు. J





వికలాంగుల దినోత్సవ సభలో మాట్లాడుతున్న కలెక్టర్ రాంగోపాల్.

## వికలాంగులను ఆదుకొంటాం!

వికలాంగులలో వున్న ఆత్మన్యూనతాభావాన్ని తొలగించి వారిలో ఆత్మవిశ్వాసం, ధైర్యం, ప్రతిభాపాటవాలను వెలికి తీయడానికి సమాజంలో ప్రతిఒక్కరూ ప్రోత్సహించాలని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ పిలుపునిచ్చారు. 3వ తేది కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన 51వ ప్రపంచ వికలాంగుల దినోత్సవంలో కలెక్టర్ ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. మేనరికాలు, దగ్గరి సంబంధాలు చేసుకోవడం వలన గర్భిణిగా వున్నప్పుడు వ్యాధినిరోధక టీకాలు వేయించుకోవడం, పిల్లలకు పోలియో డ్రాప్స్ వేయించడం తదితరాలు పాటించడం ద్వారా అంగవైకల్యాన్ని నివారించవచ్చున్నారు. దేశంలో రాష్ట్రస్థాయిలో వికలాంగులకు ప్రత్యేకించి ఒక శాఖ మన రాష్ట్రంలోనే వుందన్నారు. వికలాంగ విద్యార్థులకు వారి ఇంటి వద్దనే విద్య నేర్పేందుకు ఉపాధ్యాయులను కూడా రాజీవ్ విద్యామిషన్ ద్వారా నియమించిందన్నారు. వికలాంగులు మెప్మా ద్వారా ఇచ్చే శిక్షణా కార్యక్రమంలో పాల్గొని ఉద్యోగాలు పొందాలన్నారు. గత ఏడాది ఇక్కడ శిక్షణ పొందిన 75 శాతం మందికి ఉద్యోగాలు వచ్చాయన్నారు. జిల్లాలో 26,876 మందికి వయస్సుతో నిమిత్తం లేకుండా కోటి 34 లక్షల మేర వికలాంగ పింఛన్లు అందిస్తున్నామన్నారు. వికలాంగ విద్యార్థులకు స్కాలర్ షిప్పులను 700 రూపాయల నుండి 1820 రూపాయల వరకు తరగతిని బట్టి ఇవ్వడం జరుగుతుందన్నారు. వికలాంగులకు ఇళ్ల స్థలాలు ఇవ్వను కూడా కార్యాచరణ రూపొందించినట్లు చెప్పారు.

## ధర్మల్ ప్రాజెక్టులతో ఇబ్బందులే!

జిల్లాలో తీరప్రాంత మండలాల్లో ఏర్పాటవుతున్న బొగ్గు ఆధారిత ధర్మల్ ప్రాజెక్టుల వలన అన్నీ నష్టాలేనని విద్యుత్ ఉత్పత్తి, వినియోగం విశ్లేషకులు డాక్టర్ శంకర్‌శర్మ హెచ్చరించారు. నగరంలోని ఏనుగు సుందరరామిరెడ్డి ఆడిటోరియంలో ధర్మల్ ప్రాజెక్టుల వలన కలిగే అనర్థాలపై జరిగిన సదస్సులో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని వివిధ అంశాలపై ప్రసంగించారు. ధర్మల్ ప్రాజెక్టుల వలన విద్యుత్ ఉత్పత్తి కంటే దాని వలన కలిగే అనర్థాలే అధికమన్నారు. బొగ్గు ఆధారిత ప్రాజెక్టుల వలన వాతావరణంలో ఉష్ణోగ్రత పెరుగుతుందని ఈ




సదస్సులో మాట్లాడుతున్న డాక్టర్ శంకర్ శర్మ.

కారణం వలన సముద్రం ముందుకు వచ్చే ప్రమాదం వుందన్నారు. భూమి, వాతావరణ సమతుల్యం దెబ్బతినడంతోపాటు జీవరాశులన్నింటిపై దుష్ప్రభావం చూపుతుందన్నారు. 30వేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి వలన సాధారణం కంటే నాలుగైదు డిగ్రీల ఉష్ణోగ్రత పెరిగే ప్రమాదం వుందన్నారు. ధర్మల్ ప్రాజెక్టులు విడుదల చేసే వాయువుల వలన కాలుష్యం ఏర్పడుతుందని, మనుషుల ఆరోగ్యంపై తీవ్ర ప్రభావాన్ని చూపుతాయని ఆందోళన చెందారు. ఊపిరితిత్తుల సమస్యలు ఎదురౌతున్నాయని, నరాలపై ఒత్తిడి అధికం అవుతుందని, భూగర్భ జలాలు, పశువులు అనారోగ్యానికి గురి కావడంతోపాటు వ్యవసాయంపైనా ఆ ప్రభావం అధికంగా వుంటుందని హెచ్చరించారు.

## దొరికిపోతున్న బంగారు వ్యాపారస్తులు!

నెల్లూరు నగరంలో నిర్వహిస్తున్న బంగారు షాపులు చూడడానికి చిన్న చిన్నవిగా కన్పిస్తున్నా వాటిలో జరిగే అక్రమాలు, అవకతవకలు అధికారులకు కళ్లు తిరిగేలా చేస్తున్నాయి. చాలాకాలంగా బంగారు వ్యాపారుల లావాదేవీలపై కన్నేసిన ఆదాయ పన్ను అధికారులు పకడ్బందీగా తమ తనిఖీలు జరుపడంతో నగరంలోని పలు షాపుల నిర్వాహకులు విలవిల్లాడిపోతున్నారు. మండపాల వీధిలో గల ఒక బంగారు వర్తకుడు ఇటీవల భూరి భవంతిని నిర్మించాడు. దీనిపై ఐటి శాఖకు సమాచారం అందడంతో ఆ వ్యాపార సంస్థపై నిఘా వుంచి ఒక్కసారి దాడి చేయ

### కోట్లలో వ్యాపారాలను గమనించిన ఐటి శాఖ

డంతో కళ్లుతిరిగే నిజాలు బయటపడ్డాయి. ఆ వ్యాపారి వద్ద 50 కోట్ల రూపాయల ఆస్తులు దొరకడంతో అధికారులు నిశ్చేష్టులయ్యారు. అతన్ని మూడు రోజులపాటు గృహనిర్భంధంలో వుంచి క్షుణ్ణంగా వ్యాపార లావాదేవీలను పరిశీలించి తర్వాత కోట్లలో పన్ను ఎగవేస్తున్నట్లు అధికారులు గుర్తించారు. దీంతో యంత్రాంగం పూర్తిస్థాయిలో దర్యాప్తు జరిపేందుకు నడుం బిగించింది. పెద్ద ఎత్తున అమ్మకాలు సాగించే వ్యాపారుల అంగళ్లపై దాడులు చేయడంతో వారు చేస్తున్న అక్రమాలు బట్టబయలయ్యాయి. నగరంలో చిన్న షాపులు పెట్టుకొని వీరు నగలు అమ్మడమేగాక బాంబే తదితర ప్రాంతాల నుంచి పెద్ద ఎత్తున బంగారు కొని దానిని కరిగించి వివిధ రకాల నగలను తయారుచేసి దేశంలోని మహానగరాలకు సరఫరా చేయడమేకాక విదేశాలకు ఎగుమతి చేస్తున్నారట. ఇదంతా లెక్కాపక్కా లేకుండా జరిగిపోతున్నదట. దీనిపై సమాచారం అందుకొన్న ఐటి అధికారులు కమర్షియల్ టాక్స్ అధికారులతో కలసి ఈ అక్రమాలను వెలికి తీస్తుండడంతో బంగారు వ్యాపారులకు వెన్నులో వణుకు పుడుతుంది. తమ తప్పొప్పులను కప్పిపుచ్చుకోను కొందరు వ్యాపారస్తులు అమ్మకాల రికార్డులను తూతూమంత్రంగా తయారు చేయిస్తున్నారు. మరికొందరు వ్యాపారస్తులు ఐటి శాఖ అధికారులు రాగానే దుకాణాలు మూస్తున్నారు.

## మంత్రిగా నెగ్గుకు రాగలడా?

- రామనారాయణ ముందు సవాళ్లు



జిల్లా నుంచి ఆనం రామనారాయణరెడ్డి మరోమారు మంత్రిత్వాన్ని దక్కించుకొన్నాడు. అదీ ఏకంగా ఆర్థిక శాఖా మంత్రిగా అవకాశం లభించడం విశేషం. జిల్లాలో కాంగ్రెస్ పార్టీ వర్గ వైషమ్యాలతో కొట్టుమిట్టాడుతున్న తరుణంలో మంత్రిగా రామనారాయణరెడ్డి ఎంతవరకు నెగ్గుక రాగలడు అనేదే అందరినీ వేధిస్తున్న ప్రశ్న. ముఖ్యమంత్రిగా వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో మంత్రి పదవి చేపట్టిన రామనారాయణరెడ్డి వైఎస్ మరణానంతరం ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించిన రోశయ్య క్యాబినేట్‌లోనూ మంత్రిగా కొనసాగారు. ఇప్పుడు క్రొత్త ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి మంత్రివర్గంలో ఆర్థిక శాఖా మంత్రిగా బాధ్యతలు చేపట్టారు. ఈ పరిస్థితులలో జిల్లాలో ఆయన ప్రభావం ఎంతమేర వుంటుందనేది ప్రశ్న. జిల్లాలో కాంగ్రెస్ పార్టీ నేదురుమల్లి, పనబాక, ఆనం గ్రూపులతోపాటు జగన్ వర్గంగా విడిపోయి వుంది. జగన్ కాంగ్రెస్ పార్టీ నుంచి బయటకు వెళ్లిన తర్వాత ప్రత్యేకంగా తయారైంది. జిల్లాలో నలుగురు కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, ఇద్దరు ఎమ్మెల్సీలు వుండగా వీరిలో ఆనం సోదరులు ఒకటిగా, ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి జగన్ శిబిరంవైపు వుండగా సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఒక్కడే ఒకటిగా, ఇరువురు ఎమ్మెల్సీలు బొమ్మిరెడ్డి, బూదాటి ఆనంతో చెట్టాపట్టాల్ వేసుకొని తిరుగుతున్నారు. ఈ నేపథ్యంలో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తన నియోజకవర్గం, సోదరుడు వివేకానందరెడ్డి నియోజకవర్గాలు తప్ప మరే ఇతర నియోజకవర్గాలలో వేలు పెట్టడంకానీ, తొంగిచూసే అవకాశం గానీ లేవు. ఎవ్వరూ ఆనం సోదరులు నిర్వహించే కార్యక్రమాలకు తమ సహకారం అందించే అవకాశాలు లేవు. మొన్నటి కాంగ్రెస్ 125 ఏళ్ల ఉత్సవాలు ఈ విషయాన్ని తేటతెల్లం చేశాయి. చావు తప్పి కన్ను లొట్టపోయిన చందంగా కార్యక్రమాలు జరిపారు. ఈ పరిస్థితులలో ఆనం ఆర్థిక మంత్రిగా జిల్లాలో ఎంతవరకు నెగ్గుకరాగలడన్నది ప్రశ్నగా మారింది.

## అసమ్మతి కుంపట్లు

మొదటి పేజీ కొరవ

అందరి చేత అన్నా అన్పించుకోదగిన వారే కదా? కానీ కిరణ్ పరిస్థితి అది కాదు. నిన్న మొన్నటివరకు చాలా మంది మంత్రులను ఆయన అన్నా అని పిలిచేవాడు. ఆయన్ను వారు కిరణ్ అని చనువుగా సంబోధించినవారే. ఇప్పుడు ఆయన ముఖ్యమంత్రి హోదాలో, వీరు ఆయన క్రింద మంత్రులుగా వున్నారు. దానితో కిరణ్‌ను అన్నా అని కానీ, సర్ అని కానీ పిలవడానికి వారికి మనసొప్పడం లేదు. తమకంటే రాజకీయంగా అనుభవం తక్కువ కల్గిన వాడు తమకంటే పైకి ఎదగడం వీరికి బాధగా వుంది. దానికి తోడు శాఖల కేటాయింపుల్లో ముఖ్యమంత్రి ఏకపక్షంగా వెళ్లడంతో మంత్రులు మంచి కాక మీద వున్నారు.

వీరితో ఏగుక రావడం కిరణ్‌కు అంత సులభ సాధ్యం కాదు. ఎంతో ఓర్పు, నేర్పు, రాజనీతిజ్ఞత, లౌక్యం వుంటే తప్ప మంత్రులతో సత్సంబంధాలు నెరపడం కష్టం. దురదృష్టవశాత్తు అవేవీ కిరణ్‌లో కన్పించడం లేదు. స్వాభావికంగా ఆయనకు తన లోకంలో తాను బ్రతికే అలవాటు. దానితో ఎవరితోనూ మనసు విప్పి మాట్లాడే అలవాటు లేదు. ఆలోచన తప్ప సమాలోచన వుండదు. పరిపాలనలో అది అప్పుడే కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. మంత్రుల దారి మంత్రులది, తన దారి తనదిగా వుంది. అహంకారం పాలు ఎక్కువనే ఆరోపణ ఆయన మీద విన్పడుతున్నది.

వైఎస్ కాలంలో ఢిల్లీపెద్దలెవరూ రాష్ట్రం నుంచి వచ్చేవారికి చెవి ఇచ్చేవారు కాదు. ఫిర్యాదులు, పితూరీలకు అవకాశం లేదు. వైఎస్‌కు చెప్పకుండా ఢిల్లీకి వెళ్లాలంటేనే మంత్రులకు చచ్చే భయం. కానీ ఇప్పుడు మొలతాడు లేనివాడు కూడా విమానమెక్కి ఢిల్లీ వెళ్లిపోతున్నాడు. నేరుగా సోనియా గాంధీని కలిసి ముఖ్యమంత్రి మీద ఆరోపణలు కురిపిస్తున్నారు. తమ వాదన విన్పిస్తున్నారు. దీనితో ఢిల్లీలో ఏమి జరుగుతుందో తెలుసుకోవడం ముఖ్యమంత్రికి పెద్ద పనిగా మారింది. ఎవరెవరు వెళ్తున్నారు, ఎవరిని కలుస్తున్నారు, ఏమి చెప్తున్నారు అన్న ఆందోళనతో సతమతమౌతున్నాడాయన.

దీన్ని బట్టి అర్థమయ్యేది ఒక్కటే. కాంగ్రెస్ సంస్కృతిలో ఒక భాగంగా వుండి, వైఎస్ కాలంలో అదృశ్యమైపోయిన అసమ్మతి కుంపట్లు మళ్లీ రాజుకోవడం ఖాయమన్న నిజాన్ని ఎవరైనా ఒప్పుకొని తీరాలి. మంత్రుల నుంచి ముఖ్యమంత్రికి సహకారం అందుతుందా అన్నది అనుమానం. మంత్రులు అధికార కార్యకలాపాలకు దగ్గరగా వుంటారు. వారితో సఖ్యత లేకుంటే, ముఖ్యమంత్రి చేసే ప్రతి పనిలో తప్పులు వెతకడం సహజం. ఎక్కడో ఒక దగ్గర ఇరికించి, ఇబ్బంది పెట్టడం సులభంగా జరిగిపోతుంది.

పక్షం రోజులలో తెలంగాణ పిడుగు నెత్తిపై పడడానికి సిద్ధంగా వుంది. ఇప్పటికే గద్దర్, కెసిఆర్‌లు ఒక ప్రక్క రణ నినాదాలు చేస్తున్నారు. దామోదర్ రెడ్డి వంటి కాంగ్రెస్‌వాదులు కత్తులు నూరుతున్నారు. రాజకీయంగా జగన్ ముప్పు మరొకప్రక్క పొంచి వుంది. ఉద్యోగుల ఆందోళనలు, మంద కృష్ణ మాదిగ ఆవేశాలు, రైతుల ఆక్రందనలు రాష్ట్రాన్ని అతలాకుతలం చేస్తున్నాయి. జగన్ చీకాకు చెప్పనే అవసరం లేదు. కడప ఉప ఎన్నిక అటు జగన్‌కు ఇటు ముఖ్యమంత్రికి అగ్ని పరీక్ష. ఎమ్మార్ ఎంజిఎఫ్, రహేజా, ఓబుళాపురం వంటి అవినీతి కుంభకోణాలు పీడ కలల వలె వెన్నాడుతున్నాయి. ఇన్ని సమస్యలను నెగ్గుక రావాలంటే ప్రభుత్వంలో, పార్టీలో పూర్తిస్థాయి మద్దతు తప్పనిసరి. కానీ అది కిరణ్‌కుమార్ రెడ్డికి లభించే సూచన కన్పించడం లేదు. ఆయనా అందుకు తగిన రీతిలో వ్యవహరించడం లేదు. ఎవరి సహకారమూ లేకుండా ఒంటరిగా సమరం చేయాలన్నది ఆయన ప్రయత్నంగా వుంది. చాలా చిన్న వయస్సులో, ఎటువంటి రాజకీయ అనుభవం అవగాహన లేకపోయినా అదృష్టం వరించింది ఆయన్ను. ముఖ్యమంత్రి పదవి సంపాదించుకోవడం కంటే, దాన్ని నిలబెట్టుకోవడం చాలా కష్టం. ఆ నేర్పు కిరణ్‌లో ఎంత వరకు వుందో వేచి చూడాలి.




## తలదించుకోవాల్సిన విషయం

5వ పేజీ కొరవ

కాంట్రాక్టర్‌కు చెల్లించడానికి కాదనే పేలవమైన సమాధానంతో తమ నీచాన్ని దాచుకోవడానికి విఫల ప్రయత్నం చేస్తున్నారు ఇంజనీర్లు. కానీ జనం మాత్రం ఆ మాటలు నమ్మడం లేదు. వారు తమ ఎదురుగా వస్తే, కేకరించి నోట్లో వూయడానికి కూడా వెనుకాడేట్లు లేరు జనం. అధికారుల మీద అంత అసహ్యం పుడుతున్నది. మరీ విచారించవలసిన విషయం – జిల్లా కలెక్టర్ రాంగోపాల్ సైతం దొంగ బిల్లులు తినడానికి ప్రయత్నించిన ఇంజనీర్లను వెనకేసుకొని రావడం. ఆయన కూడా వారు చెప్పే, లెక్క కోసం బిల్లు వ్రాసామనే వాదనను వల్లె వేస్తున్నాడు. ఆయన మీద ఎటువంటి ఒత్తిడులు వున్నాయో తెలియదు. జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి కూడా ఈ తోడు దొంగలతో కలిసి పోవడం మరింత బాధాకరం. మూడు రోజుల క్రితం ఆయన గండి పూడుస్తున్న పనులను చూసి, బ్రహ్మాండం అని మెరిట్ సర్టిఫికేట్ ఇచ్చాడు. ఆ పక్కరోజే ఆ పనుల బండారం బయట పడిపోయింది. దొంగ బిల్లులలో ఆయనకు ఎంత వాటా వుందో దేముడికే తెలియాలి.

ఏది ఏమైనా నెల్లూరుజిల్లాలో ప్రభుత్వ వ్యవహారాలు రోజురోజుకీ పరమ జుగుప్సాకరంగా తయారౌతున్నాయి. ప్రజాధనాన్ని ఎన్ని రూపాలలో వీలైతే అన్ని రూపాలలో అప్పనంగా ఆరగించడం అధికారులకు, రాజకీయవాదులకు అలవాటుగా మారిపోయింది. రోడ్డు వేస్తే వారం నిలవదు. వంతెన కడితే వానకు తట్టుకోలేదు. నగరం నడిబొడ్డులో ప్రభుత్వ స్థలాలను ఆక్రమిస్తే అడ్డుకొనేవాడు లేడు. వేలాది ఎకరాల ప్రభుత్వ భూములను పారిశ్రామికులకు ఇస్తుంటే ఏమని ప్రశ్నించే వాడు లేడు. పది మైళ్ల వ్యాసంలో ఇరవై థర్మల్ స్టేషన్లు కట్టి, నెల్లూరు జిల్లాను కాలుష్య కాసారంగా మారుస్తుంటే స్పందించేవాడు లేడు. అధికారులు ఎటువంటి దుర్మార్గాలకు, దుర్న్యాయాలకు పాల్పడుతున్నా అడిగేవాడు లేడు. అడిగించుకొనే వాడూ లేడు. పత్రికలలో వార్తలొస్తే పట్టించుకొనే వాడు లేడు. పైనుంచి క్రింద వరకు అందరూ దొంగలే అయినప్పుడు, దొంగతనాలు ఎవరు పట్టించుకొంటారు? జిల్లాకు పట్టిన ఈ దరిద్రం ఎప్పటికి వదులుతుందో, ఎట్లా వదులుతుందో ఆ భగవంతుడికే తెలియాలి. కలెక్టర్ గారూ, కనీసం ఈ వారధి విషయంలోనైనా ప్రభుత్వ పందికొక్కులను అదిలించండి. లేకుంటే రైతుల వుసురు మీకూ తగులుతుంది.

## కెవిపి తెగతెంపులు

మొదటి పేజీ కొరవ

ఒప్పుకోనని హెచ్చరించాడట.

వైఎస్ ప్రాణ స్నేహితుడిగా కెవిపి.రామచంద్రరావు ఈ పోకడ ఎందుకు అవలంబించాడో ఆయనకు సన్నిహితులైన వారికి కూడా అర్థం కావడం లేదు. వైఎస్‌కు కెవిపి నమ్మక ద్రోహం చేయడం నమ్మలేని నిజమని ఆశ్చర్యపోతున్నారు అందరూ. తన సంపాదన దాచి పెట్టుకోవడం, వ్యాపారాలు చక్కబెట్టుకోవడం, కేసులు గీసులు తన మీదకు రాకుండా చూసుకోవడం కోసమే ఆయన ఇంతకు తెగించాడన్నది జగన్ అభిప్రాయం. కానీ జగన్‌ను విడిచి కాంగ్రెస్‌లో బానిస బ్రతుకు బ్రతకడానికి కెవిపి సిద్ధపడడాన్ని సాధారణ కాంగ్రెస్ కార్యకర్తలు కూడా హర్షించడం లేదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

లేక రాష్ట్రంలో మంత్రిగా ఎదగడా నికి 63సంవత్సరాలు పట్టింది. అదే ఉత్తర భారతంలో రజకులు ఎస్.సిలుగా వుండి ఎమ్మెల్యేలుగా, మంత్రులుగా ఎదిగారు. సారయ్య రాష్ట్రంలోని 70లక్షల రజకుల గౌరవాన్ని పెంపొందింవ చేసేలా పని చేయమని మనవి.

*వింజమూరు మస్తాన్‌బాబు, నెల్లూరు*

## తీరప్రాంతాన్ని బూడిదతో కప్పేస్తారా?

జిల్లాలోని సముద్ర తీరప్రాంతాన 10కిలోమీటర్ల పరిధిలో 28 థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల ఏర్పాటుకు ప్రభుత్వం అనుమతి నిచ్చింది. ఈ ప్రాజెక్టుల్లో నాలుగు లక్షల టన్నుల బొగ్గు కాల్చాల్సి వుంటుంది. దీనివల్ల ఏడాదికి ఎన్ని లక్షల టన్నుల బూడిద విడుదలవుతుందో లెక్క కట్టలేం. దీనితో వాతావరణ కాలుష్యం, పర్యావరణ ముప్పు ఏర్పడుతుంది. ప్రపంచమంతా గ్లోబల్ వార్మింగ్ పరిధిలో కాలుష్య నివారణకు నడుంకట్టిన సమయంలో కాలుష్య భరితమైన బొగ్గు ఆధారిత థర్మల్ కేంద్రాలను జిల్లాలో ఇబ్బడిముబ్బడిగా అనుమతులివ్వడం దుర్మార్గం. దీనిద్వారా ప్రజల ఆరోగ్యానికి, వ్యవసాయ రంగానికి, మత్స్య సంపదకు తీవ్ర నష్టం చేకూరుతుంది.

*డి.రాజేంద్రప్రసాద్, నెల్లూరు*

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఈ హాస్టల్ వార్డన్ సురేంద్ర మహా ఘటికుడు. గిరిజన సంక్షేమశాఖ జిల్లా అధికారికి అన్ని వ్యవహారాల్లో మంచి చెడ్డలు చూడాలన్న నెపంతో వార్డెన్ల దగ్గర నెల మామూళ్లు వసూలు చేస్తాడన్న ఆరోపణలు వున్నాయి. గతంలో సిఎం పేషీ అధికారులను సైతం డబ్బుతో ప్రలోభాలకు గురిచేశాడని ఆ శాఖలోని ఉద్యోగులే వ్యాఖ్యానిస్తున్నారు. గొలగమూడి గిరిజన ఆశ్రమ పాఠశాలపై ఎసిబి దాడితో జిల్లాలోని హాస్టళ్లలో దోపిడీ బట్టబయలైంది.

## దత్త జయంతి

నెల్లూరులోని తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం, డాక్టర్ సర్వేపల్లి మ్యూజికల్ ఫౌండేషన్ సంయుక్త యాజమాన్యాన 18, 19, 20 తేదీల్లో దత్త జయంతి మహోత్సవాలను నిర్వహిస్తున్నారు. ఈ సందర్భంగా టివిఎస్ కళ్యాణసదన్‌లో 18, 19 తేదీల్లో సాహిత్య సంగీత ప్రాచుర్యోత్సవాలు నిర్వహిస్తారు. 18వ తేది శాస్త్రీయ సంగీత విభావరి, 19వ తేది అరుణ పారాయణం, వేద విద్యార్థులకు ఋగ్వేద, యజుర్వేద పరీక్షలను నిర్వహిస్తారు. 20వ తేది ప్రముఖ పండితులు మాచవోలు రాజశేఖర శాస్త్రి నేతృత్వంలో దత్త హోమం జరుగుతుంది. 20వ తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో వేదస్వస్తి కార్యక్రమం నిర్వహిస్తారు. ప్రఖ్యాత సంగీత విద్వాంసులు డాక్టర్ వైజర్స్ బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి వసంత సుబ్బలక్ష్మి శాస్త్రీయ సంగీత కచ్చేరి నిర్వహిస్తారు. ఇదే వేదికపై వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు డాక్టర్ పి.వి.సాయికృష్ణ యాచేంద్ర, వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్‌లను సన్మానిస్తారు. ఈ కార్యక్రమాలకు అందరినీ తరలి రమ్మంటున్నాడు నిర్వాహకుడు డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్.

## వెంకట్రామా అండ్‌కో అధినేత మరణం



పుస్తక వ్యాపారంలో పేరు ప్రఖ్యాతులుగాంచిన నెల్లూరు ట్రంకురోడ్డులోని వెంకట్రామా అండ్ కో అధినేత శ్రీపతి ప్రసాద్(54) డిశంబర్ 4వ తేది మరణించారు. ఆయనకు భార్య, కుమార్తె, ముగ్గురు అన్నదమ్ములున్నారు. మరణానంతరం కుటుంబసభ్యులు ఆయన నేత్రాలను దానం చేశారు.

### ● కావలిలో

# విజయవంతంగా విద్యా వైజ్ఞానిక ప్రదర్శన!

ప్రతి ఏడాదిలాగే ఈ సంవత్సరం జిల్లాస్థాయి సైన్సుఫేర్‌ను నిర్వహించింది విద్యాశాఖ. కావలి విశ్వోదయ బాలుర బాలికల ఉన్నతపాఠశాలలో డిసెంబర్ 3వ తేది నుంచి 5వరకు మూడు రోజులపాటు జరిగిన ఈ విద్యా వైజ్ఞానిక ప్రదర్శనకు జిల్లా నలుమూలల నుంచి  ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలల విద్యార్థులు



వీక్షకులకు ప్రయోగ వివరాలు చెబుతున్న విద్యార్థులు.

పాల్గొని తాము తయారు చేసిన నమూనాలను ప్రదర్శనలో వుంచారు. మొత్తం 453 పాఠశాలల నుంచి 460 ప్రదర్శనలు ఏర్పాటు కాగా, వీటిలో 401 ఉన్నతపాఠశాలలు 52 ప్రాథమికోన్నత పాఠశాలలు వున్నాయి. అధికారులు ఈ ప్రదర్శనలో పాల్గొనే విద్యార్థులకు ఎంపిక చేసిన అంశాలలో నమూనాలు ప్రదర్శించేలా సూచించారు. బయోడైవర్సిటీ, కన్సర్వేషన్ అండ్ సస్టెయినెన్స్, అగ్రికల్చర్ అండ్ టెక్నాలజి, గ్రీన్ ఎనర్జీ, ట్రాన్స్‌పోర్ట్ అండ్ కమ్యూనికేషన్స్, కమ్యూనిటీ హెల్త్ అండ్ ఎన్విరాన్‌మెంట్, మ్యాథమ్యాటికల్ మోడలింగ్, టెక్నాలజీ ఫర్ ఛాలెంజస్ అనే అంశాల్లో విద్యార్థులు తమ ఆలోచనలకు రూపమిచ్చి నమూనాలను ప్రదర్శించారు.

జిల్లావ్యాప్తంగా విద్యార్థులు పాల్గొన్న ఈ విద్యా వైజ్ఞానిక ప్రదర్శన కోలాహలంగా సాగింది. చిన్నారుల ఆలోచనలకు అద్దం పట్టడంతోపాటు వారి ప్రతిభకు వేదికైంది. కాలుష్యం లేని వాతావరణం, సహజ వనరుల సద్వినియోగం, వ్యర్థాలతో ఉపయోగం, ప్రమాదాలు జరగకుండా వాహనాలకు అదనపు పరికరాలు అమర్చడం తదితర వాటిల్లో విద్యార్థులు చేసి చూపించిన ప్రదర్శనలు వారి మేథస్సును వారి ఆలోచనా దృక్పదాన్ని తెలియజేశాయి. వాహనాలకు ముందు వెనుక స్ప్రింగ్‌లను అమర్చడం ద్వారా ప్రమాదాలను నివారించవచ్చని సిఎస్‌పురం గురుకులపాఠశాల విద్యార్థులు ప్రయోగాత్మకంగా చేసి చూపారు. చౌకగా విద్యుత్ శక్తిని తయారు చేసుకోవడాన్ని నారాయణ స్కూలు విద్యార్థులు, వ్యర్ధాలతో గ్యాస్ తయారీని సూళ్లూరుపేట పద్మావతిస్కూలు విద్యార్థులు, వంతెనలు కల్వర్టులపై ప్రత్యేకంగా వీల్స్‌ను ఏర్పాటు చేయడం ద్వారా లైట్లు వెలిగేలా చేయడం, వ్యర్థాలతో రీసైక్లింగ్, వర్మికంపోస్టు యూనిట్, ఉప్పునీటితో నడిచే బోటు, వనమూలికలతో ఆరోగ్యంతోపాటు థర్మల్ ప్రాజెక్టు వలన కలిగే ముప్పు అంశాలపై విద్యార్థులు తయారుచేసి ప్రదర్శించిన నమూనాలు ఆలోచనను రేకెత్తించేలా వున్నాయి.



తాము చేసిన నమూనాలను ప్రదర్శిస్తున్న విద్యార్థినులు.

విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలో తమ నైపుణ్యాన్ని తెలియపరిచేలా నమూనాలు ప్రదర్శించిన విద్యార్థులు అధికారుల వైఫల్యం కారణంగా సమయానికి ఆహారం అందక ఆకలితో అలమటించాల్సిన పరిస్థితి ఏర్పడింది. వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన విద్యార్థులు, ఉపాధ్యాయులకు వసతి సౌకర్యాలు కల్పించడంలోనూ అధికారుల నిర్లక్ష్యం కొట్టొచ్చినట్లు కన్పడింది. ఆకలి బాధను భరిస్తూనే తమ తెలివితేటలను లోకానికి చాటి చెప్పారు విద్యార్థులు. ఈ ప్రదర్శనకు జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఐదు లక్షల రూపాయలు కేటాయించినప్పటికీ విద్యాశాఖ అధికారులు తమ పాత అలవాటును వదులుకోలేక ప్రైవేట్ పాఠశాలల నిర్వాహకులు, వివిధ సంస్థల నుంచి దండకాలు చేయడం విద్యాశాఖ పరువును దిగజార్చింది. ఈ ప్రదర్శనను జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ప్రారంభించగా ముగింపు కార్యక్రమానికి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, శాసనసభ్యులు బీద మస్తాన్ రావు, బల్లి దుర్గాప్రసాద్, శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం, కలెక్టర్ రాంగోపాల్ పాల్గొన్నారు.

# ఆకట్టుకొన్న విద్యార్థి, యువజన సమ్మేళనం!

నెల్లూరు నగరంలో ఇటీవల విద్యార్థి, యువజన సమ్మేళనం ఘనంగా జరిగింది. నవయువ సమాఖ్య, ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం ఆధ్వర్యంలో ఈ సమ్మేళనం నిర్వహించారు. ప్రధానంగా విద్యార్థులు ఎదుర్కొంటున్న అనేక సమస్యలపై చర్చించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగాన్ని పూర్తిగా కార్పొరేట్ సంస్థలకు అప్పగించేందుకు ప్రయత్నాలు చేస్తున్నాయని ఈ ప్రయత్నాలను విద్యార్థి, యువజన సంఘాలు త్రిప్పికొట్టాలని సమ్మేళనంలో పాల్గొన్న వక్తలు పిలుపునిచ్చారు. ప్రపంచ బ్యాంకు విధించిన షరతుల్లో భాగంగా ప్రభుత్వ రంగ సంస్థల్లో ఉద్యోగాల భర్తీని ప్రభుత్వం నిలిపి వేసిందని ధ్వజమెత్తారు.

పబ్లిక్ సర్వీస్ కమిషన్, రైల్వే, బ్యాంకింగ్ రంగాలలో అనేక ఉద్యోగాలు భర్తీకి నోచుకోవడం లేదు. రాష్ట్రంలో బిఇడి, డిఇడి చేసిన లక్షలాది మంది ఉపాధ్యాయ పోస్టుల కోసం ఎదురు చూస్తుంటే ప్రభుత్వం నిర్లక్ష్యంతో వ్యవహరిస్తుందని ఆవేదన వ్యక్తపరిచారు. నిన్న, మొన్నటి వరకు పెద్ద ఎత్తున ఉపాధి అవకాశాలు కల్పిస్తామని పాలకులు చేసిన ప్రకటనలు కేవలం కాగితాలకే పరిమితమై పోయాయి. ఐటి రంగంలో స్థిరపడాలన్న సంకల్పంతో పట్టాలు చేతపట్టుకొని వేలాది మంది విద్యార్థులు బయట తిరుగుతున్నారు. చదివిన చదువులతో ఎలాంటి సంబంధంలేని ప్రైవేటు కంపెనీల్లో తక్కువ వేతనానికి పని చేయాల్సిన దుస్థితిలో వున్నారు.

## గ్రామీణ ప్రాంత సమస్యలపై దృష్టి!

నెల్లూరు నగరంలో రెండు రోజులపాటు నిర్వహించిన విద్యార్థి, యువజన సమ్మేళనంలో 6వ తేది గ్రామీణ ప్రాంతాలలోని యువజనులు, రైతులు ఎదుర్కొంటున్న పలు సమస్యలు, ప్రభుత్వం అమలు చేస్తున్న సంక్షేమ అభివృద్ధి పథకాలపై సమగ్రంగా చర్చించడం జరిగింది. గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారు వలసలు వెళ్లకుండా నియంత్రించి వందరోజులు ఉపాధి కల్పించాలన్న లక్ష్యంతో ప్రవేశపెట్టిన ఉపాధిహామీ పథకాన్ని అధికార పక్షానికి చెందిన నేతలు, కొందరు అధికారులు కలిసి నిర్వీర్యం చేస్తున్న విధానాన్ని సమావేశంలో ఎండగట్టారు. ప్రజలకు చెల్లించాల్సిన కూలీ డబ్బును జేబుల్లో నింపుకోవడం దౌర్భాగ్యంగా అభివర్ణించారు.

మన రాష్ట్రంతోపాటు పంజాబ్, ఢిల్లీ రాష్ట్రాలకు చెందిన పలువురు ప్రొఫెసర్లు ఈ సమ్మేళనానికి హాజరై విద్యార్థి, యువజనుల చైతన్యానికి చేపట్టాల్సిన కార్యక్రమాల గురించి వివరించడం జరిగింది. సమ్మేళనం అనంతరం పిడిఎస్ఓ, ఎన్‌వైఎస్ వేర్వేరుగా రాష్ట్ర కార్యవర్గ సమావేశాలను నిర్వహించాయి. చాలా సంవత్సరాల తర్వాత ఎన్‌వైఎస్, పిడిఎస్ఓ రాష్ట్ర కార్యవర్గ సమావేశాలు సమ్మేళనాన్ని నిర్వహించడంతో జిల్లాలోని అనేకమంది సానుభూతిపరులు ఈ సభలకు హాజరయ్యారు. కో-ఆపరేటివ్ బ్యాంక్ ఆవరణలోనూ దర్గామిట్టలోని కళ్యాణ మండపంలో నిర్వహించిన బహిరంగ సభలలో వక్తలు చేసిన ఉపన్యాసాలు ఎంతగానో ఆకట్టుకున్నాయి.




నవయువ సమాఖ్య సమ్మేళనంలో  పాల్గొన్న ఉద్యమ నేతలు.

## ఆకట్టుకున్న కళాప్రదర్శనలు

విద్యార్థి, యువజన సమ్మేళనం ఏర్పాటు సందర్భంగా జనసాహితి కళాకారులు కళా ప్రదర్శనలు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ఉద్యమ విప్లవ గీతాలు ఆలపిస్తూ నగరంలో భారీ ప్రదర్శన చేశారు. ఈ కార్యక్రమా లలో రైతు కూలీ సంఘం నేతలు, స్త్రీ విముక్తి మహిళా నేతలు, విద్యార్థి, యువజన సంఘాలకు చెందిన నాయకులు పలుపురు కళాకారులు పాల్గొన్నారు. సిపిఐ (ఎంఎల్) జనశక్తి గ్రూపుకు అనుబంధంగా వున్న సంఘాల సమావేశం కావడంతో నిఘా విభాగం అధికారులు రెండురోజుల పాటు పర్యవేక్షణ చేశారు.





# నిడిగుంటపాళెంలో మెగా ఉచిత కంటి వైద్య మరియు వివిధ వైద్య నిపుణులతో చికిత్సా శిబిరము




కీ॥శే॥ నెనమాల సుందరరామిరెడ్డి గారు

కీ॥శే॥ నెనమాల సుందరరామిరెడ్డి - క్రిష్ణవేణమ్మ గార్ల జ్ఞాపకార్థం వారి కుమారుడు డా॥ నెనమాల ప్రేమసాగర్‌రెడ్డి గారు, M.D., FACC, FCCP., Chairman of the Board for 14 Hospitals in U.S.A., గారి సహాయ సహకారంతో శ్రీ బద్దెవోలు శ్రీహరి రెడ్డి, మమత నర్సింగ్‌హోమ్ అధినేత గారి నిర్వహణలో పాబోలు, ఓగిరాల మరియు శ్రీరామ్ ఛారిటబుల్ ట్రస్ట్ (A Unit Of మాడరన్ 'ఐ' హాస్పిటల్, నెల్లూరు) ఆధ్వర్యములో D.B.C.S. నెల్లూరు జిల్లా వారి సౌజన్యముతో


కీ॥శే॥ నెనమాల క్రిష్ణవేణమ్మ గారు

## మెగా ఉచిత నేత్ర I.O.L. శస్త్రచికిత్సా శిబిరము నిర్వహించబడును.

**తేది : 11-12-2010 శనివారం**
**ఉ॥ 9 గం॥ల నుండి మ॥ 2 గం॥ల వరకు**
**స్థలం : జిల్లా పరిషత్ హైస్కూల్ - నిడిగుంటపాళెం.**

**శిబిర ప్రారంభకులు :** శ్రీ కె.రామ్‌గోపాల్ గారు, I.A.S
(District Collector, Magistrate & Chairman - D.B.C.S. Nellore Dt.)

**ముఖ్య అతిథి :** శ్రీ ఇ.దామోదర్ గారు, I.P.S
జిల్లా సూపరింటెండెంట్, ఎస్.పి.ఎస్.ఆర్ నెల్లూరు జిల్లా

### మాడరన్ 'ఐ' హాస్పిటల్ & రీసర్చ్ సెంటర్ - నెల్లూరు నుండి శిబిరం నందు పాల్గొను డాక్టర్లు

డాక్టర్ పి.యల్.రావు
M.S., F.P.S.M (Madurai)

డాక్టర్ పి.రాజశేఖర్
MS., F.V.R.S.(CBE)F.I.C.O(UK),F.A.G.E.,DNB

డాక్టర్ పి.భారతి D.O., (Madurai)
M.S., F.P.S.M (Madurai)

డాక్టర్ ఇ.యల్.యస్.జ్యోతి
M.S., (London) FCMS (A.E.H)

డాక్టర్ ఓ.గోపాలకృష్ణ
F.A.C.S (U.S.A)

డాక్టర్ యస్.శశికళారావు
B.Sc., M.B.B.S., D.O(madurai), F.TERF

డాక్టర్ బి.కృష్ణమూర్తి
B.Sc., M.B.B.S., D.O.,

డాక్టర్ ఎ.హరిత
M.B.B.S., M.S

### ప్రఖ్యాతిగాంచిన నెల్లూరు వైద్యులచే ఈ శిబిరం నందు లభించు వివిధ వైద్యసేవలు

గుండె వైద్య నిపుణులు
డా॥ పి.మురళీ శంకర్ రెడ్డి గారు M.D.D.M., (Cardio), New Delhi
ANASUYA INSTITUTE OF MEDICAL SCIENCES

ఎముకల వైద్య నిపుణులు,
డా॥ కె.హర్షకుమార్ M.S.,(Ortho)
పొగతోట
అసోసియేట్ ప్రొఫెసర్ ఆర్థోపెడిక్స్.

చెవి, ముక్కు, గొంతు స్పెషలిస్ట్.
డా॥ ఎ.సతీష్‌చంద్రారెడ్డి M.S.,
శ్రీరామచంద్రా నర్సింగ్ హోమ్

దంతవైద్య నిపుణులు
డా॥ యం.గోకుల్ చంద్రా రెడ్డి M.D.S.
ఓరల్ సర్జన్ & ఇంప్లాంట్ స్పెషలిస్ట్

డా॥ యం.రజని M.D.S.,
ఆర్థోడాంటిస్ట్

గోకుల్ స్పెషాలిటీ దంత వైద్యశాల

**ఈ అవకాశాన్ని పేదలు సద్వినియోగం చేసుకొనవలసినదిగా కోరుచున్నాము.**

### ఉచిత కంటి వైద్య శిబిరం ప్రత్యేకతలు :

1. ప్రఖ్యాత కంటి వైద్య నిపుణులచే కంటి పరీక్షలు ఉచితముగా చేయబడును. 2. ఈ శిబిరంలో కంటి శుక్లమునకు ఆపరేషన్ అవసరమని గుర్తించిన వారికి మమతా నర్సింగ్‌హోమ్, నెల్లూరు నందు అదే రోజు ఉచితముగా కంటి ఆపరేషన్లు చేయబడును. 3. ఆపరేషన్ చేయించుకునే వారికి మమతా నర్సింగ్‌హోమ్, నెల్లూరు వరకు రానుపోను ఉచిత వాహన సదుపాయం. 4. అవసరమైన వారికి మందులు, కంటి అద్దములు ఉచితముగా ఇవ్వబడును. 5. అందరికీ భోజన వసతి కల్పించబడును. 6. ఆపరేషన్ చేయించుకోవలసిన వారు తలస్నానము చేసి రావలెను. 7. ఆపరేషన్ చేయించుకొను వారికి ఉచిత వస్త్రదాన సదుపాయము కలదు.




బి.శ్రీహరిరెడ్డి M.Sc (Ag)
## మమత నర్సింగ్ హోమ్
రామలింగాపురం, నెల్లూరు




Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.